# హరివినోదము



రచన

కవికొండల వేంకటరావు



సుమనోహ్లాదిని ప్రచురణలు
గుంటూరు - 2

# చదువు సూచన

ఇందలినుడికారము
ఛందోబద్ధము;
ఏపద్యభావ
మాపద్యముదే!
ఏద్విపదభావ
మాద్విపదదే!

రాజమహేంద్రవరము
1—7—1949

కవికొండల వేంకటరావు
"(కవి)"
"కొండకోలఁకు వికసితోత్పల"

# గమనిక

"హరివినోదము" "మమైక్యదైవసంప్రార్థనము" "శతధా" "కంచకుక్షి" లోని [illegible] పద్యములున్న, ఈ గ్రంథము నందలి ద్విపదలు 114 వఱకున్న, 1933_1937 మధ్య "కల్యాణి" "చంద్రిక", "దేశసేవ" "దేవాలయ ప్రతిభ" "ప్రాథమికవిద్య" "ప్రజామిత్ర" పత్రిక లందు తొలి ప్రకటనము గాంచియున్నవి.

"నిరంతర ప్రార్థన పద్య" మన్నది ఆంధ్ర పత్రికలో 3—1—1926 తేదీని తొలి ప్రకటన మందియున్నది.

క|| వేం||

# తొలి పలుకు

శా. సందేహం బెటు లేదు; నీవు గల వీ సర్వ ప్రపంచంబునన్
సౌందర్యం బెటు చూడఁ గన్నుగవ కచ్చా ! ఛాయలంవిచ్చు; నా
నందంబే యెటుపల్కు విన్న, మఱి సత్యంబే ప్రకాశించెడిన్
డెందాలన్, ప్రభు ! నీదు సత్కృపయ పాలించేని మా యాత్మలన్.

"కవి", కవికొండల వేంకటరావుగారిచే విరచితమైన 'హరి వినోదము, మమైకదైవ సంప్రార్థనము, శతథా, కందపుక్తి, ద్విపదలాక్షి' అను అయిదు శతకములు అయిదు విధములు. వీనియందు కవికిగల ఆధ్యాత్మికజ్ఞానము ఆధ్యాత్మికజిజ్ఞాస పూర్తిగా వెల్లడియగుచున్నవి. ఈ శతకసంపుటి కవిగారి షష్టిపూర్తి మహోత్సవమందు, ఇతరత్రా పలువుర ప్రశంసలను మన్ననల నందుకొన్నది.

వీనిగూర్చి :-

హరివినోదమునకు స్ఫురణగా శ్రీమద్భాగవతమును కవి పేర్కొంటిరి. దీనియందు వారిభక్తి సోపానములు, జ్ఞానసౌధము ఇంపుగా గోచరించును. భక్తియనునది ఉత్తములగు రామకృష్ణాదిమూర్తుల పూజాస్తోత్రములతో ప్రారంభించి, బ్రహ్మజ్ఞానము వరకు పోవును.

"రచయిత కూలంకష ప్రజ్ఞాసమన్వితుడు. పూర్వగ్రంథాలలో వున్న మహత్తర ఆధ్యాత్మికభావాల్ని చక్కగా జీర్ణించుకొని జనరంజక మైన భాషలో పరతత్వాన్ని గూర్చి వ్రాసిన పద్యాలివి".

"హరివినోదము చదువచదువ వీరిభక్తి అవతారోపాసనయను చిన్న సెలయేరై, త్రిమూర్తులను పెద్దయేరై, శక్తిరూపమున విశదమై ఏకేశ్వరోపాసనలో నేకముఖమై, సగుణ బ్రహ్మోపాసన యను జ్ఞాన వాహినియై పరతత్వమను సచ్చిదానందసాగరమున జేరినట్లు తోచు చున్నది".

మమైక దైవసంప్రార్థనము — ప్రతిపద్యము భక్తిభరితమై నిర్గుణోపాసకులైన ఆస్తికులకు ప్రియము గూర్చెడి ఉత్తమోత్తమ శతకము.

శతధా యందు దేవుడు, మతము నిర్గుణస్తవము జిజ్ఞాస, ఆదిగా గల వివిధశీర్షికలతో ఐహికాముష్మిక స్ఫురణతో వ్రాయబడిన నూరు చక్కని పద్యాలు గలవు.

కందకుక్షి, కుక్షినిగల పద్యములన్నియూ కందపద్యాలే. ఇది సర్వమానవ ప్రవృత్తి స్ఫురణతో వ్రాయబడినది. వేమన సుమతీశతక పద్యాలవలెనే నీతిని, లోకానుభవాన్ని చూపే చక్కని పద్యాలివి. వర్తమాన కాలానుగుణ్యమై యీ పద్యాలు పిల్లలు పఠనీయం చేయడం మంచిది.

ద్విపదలాక్షి బహుశాంధ్రోక్తి స్ఫురణతో వ్రాయబడిన ద్విపదలు. నీతులతో, చాటువులతో జాతీయాలతో హృద్యంగా ఉన్నవి. ఈ ద్విపదలాక్షి చిన్నబిడ్డలు కంఠస్థము చేయదగినవి.—ఈ రీతిగ పలు ప్రశంసల నందుకొనిన కవితాసంకలన మిది.

ఈ శతకసంపుటి ఏతత్కవిచే 1950 సం॥లో ముద్రితమైనది. తిరిగి వారి తృతీయవర్ధంతిని పురస్కరించుకొని 'కవికొండలవారి' ఆధ్యాత్మిక జ్ఞానతృష్ణకు స్మృతిచిహ్నంగా పాఠకుల కందజేసి, తరించునాసక్తితో పునర్ముద్రణ గావించినాము.

"సందేహంబెటులేదు, నీవుగలవీ సర్వ ప్రపంచంబునన్" అను నిశ్చయాత్మక జ్ఞానముతో భగవంతుని సర్వవ్యాపకత్వమును ప్రబోధించు ఈపొత్తము సహృదయుల ఆదరాభిమానముల బడసి "కవికొండలవారి" దివ్యస్మృతి చిహ్నమైన మాకృషిని ప్రోత్సహించెదరని మా యాశయము.

ఇట్లు
ప్రకాశకులు

# అంకితము



అనంతలక్ష్మీ సత్యవతీదేవీ సమేత
శ్రీ వీరవేంకట సత్యనారాయణ
స్వామివారికి

# విషయసూచిక

శ్రీ ర స్తు

# హ రి వి నో ద ము

---

## కవికొండల వేంకటరావు

---

### వేదసంఖ్య ౧—౪

ఉ. ఏయది పుట్టులేనిదయి యెత్తెనొ భూమి దశావతారముల్
ఏయది మిత్తిలేనిదయి యెక్కటి ముక్తిపథంబు చాటెనో
ఏయది సర్వమున్ దెలిసి యెక్కుడిమాయకుమూలమయ్యెనో
ఆయఖిలాండకోటి సతతాశ్రయశక్తి నుతింతు నిత్తెమున్.

మ. పదకన్ బాదముతాకు మాత్రమున గుండ్రాయొండు శ్రీ యయ్యెఁ గా
రడవిన్ ; రాముపదాంబుజంబులకు స్వప్రాణంబు లర్పించుచున్
మదులన్, జేతల, నంతరంగమున, సంపూజించువాఁడన్నరుం
డదరం దేగ్గృహమందుఁ జిత్రప్రభల నజ్ఞానాంధమున్ బాయుచున్ ?

ఉ. బమ్మతపస్సు, నారదుఁడు భక్తిరసంబొలుకంగఁబాడు గీ
తమ్ము, మహాత్మ ! యర్జునుఁడు దామునునీదు ప్రబోధచేత యు
ద్ధమ్మునఁ జూపినట్టి పస, దగ్గఱ దవ్వనకుండ నగ్గజేం
ద్రమ్ముటవిన్నపయన్ దలచిరక్షయొసన్న మొఱల్ ప్రసాధనాల్.

శా. క్షీరాబ్ధిన్ జిరునవ్వునవ్వు కొనుచున్ జెక్కిళ్ళుపూరించి, పా
ల్గారన్, నేరనిభంగిఁగాలి బొటవ్రేల్గారాముగాఁగుడ్చుకొం
చేరున్ లేరను భీతిలేకొకఁడవై యెట్లెట్లు చింతించెదో
శౌరీ! యాభవదీయ చింతనముచే శాంతిల్లుతన్ శోకముల్.

చంద్రకళాసంఖ్య ౫—౨౦

చ. అడుగనువచ్చి నిన్నడుగడయ్యెఁ గుచేలుఁడు నీపముందుగా
వడిముడి విప్పికొంచుఁ దినువాఁడవుగా యెడుకుల్ ముకుంద! నే
నడఁకువ నాదుచిత్తము సమర్పణసేయుమి నేకొ అంతఁగ
ద్వదనుజామా! గ్రహించెదవు బల్మినా, బంటుతనానా, చెల్మినో!

చ. శబరియొసంగు పండులవి చప్పనా తియ్యనా చేదా నేరకే
గబ గబ నారగించితివి; కాల్నడ తొందఱరాయిఁదన్ని య
య్యబల యహల్య మోక్షమున కాదరువైతివి; నాకు నేల యిం
కబెదరు? విందవై ససరె కాదని యిల్వెడలించినన్ సరే!

చ. గుహుఁడు దరించె నిన్నుడవఁ గూర్చొనబెట్టుక కోలవైచి, యో
బిహునిమునివంద్య! యోపరమపావన రామ! మహాసమర్థ! య
ల్లహనుమ పూజ్యుఁడయ్యెఁ దనలావున నీకొఱకబ్ధిదాటి, లే
హాహా! తరముల్, భవార్థమగుచో నుదధేని నదేని యొక్కెడే!

మ. నినునీవే పరిరక్షచేసికొను పెన్నేర్పుంట తథ్యంబయై
నను నా వాసుదేవుఁ డానిసిని, వానన్, పెద్దగాలిన్, మహా
నినదంబౌ వఱదన్, వడిన్ యమునపై నిన్నెత్తికొంచావిధిన్
గొని, నందాలయమున్ యశోదయొడి నుగ్గున్ద్రావఁ బంచెన్; తథా
నినురక్షించుట మాకుముక్తి జగతిన్ నిర్భిద్రతన్ గేశవా!

శా. తోటన్ నిన్ను యశోదకట్టునెడ నుల్కున్ జూపులన్ జూపి నా
వాటన్ బాటను గోపికాతతికి నాహ్లాదంబు సంధించి నా,
వేటన్ గాళియనాగునిన్ నిలిచి ప్రావృట్భోభతో నాడి నా
వోటాటోటుగ ! యుట్ల సంబరములో నున్నావురా గెంతుచున్.

శా. డేకేటప్పుడు తన్ని తేవడిగ బండిన్ దుక్కతుక్కైనటుల్,
నీకాంతామణి సత్యభామ నిను నత్తిన్ బ్రతాడింప, నీ
వేకాంతంబుగ 'దాసు' నంటివి; భవద్వృత్తాంత మేమందురా ?
నీకారుణ్యము ప్రేమ చూడఁగొనుచో నేరంబులే చందువా ?

ఉ. అన్నకుఁ దమ్ముడెంతొ వినయాన సపర్యలు సేయుచుండుటల్
మిన్నయటంచుఁ జాటితివి మేదిని సూర్యకులాన బుట్టి; లే
దన్నయబోధ; యాదవుఁడవై యనుజన్ముఁడవీవుగాఁగనే
తన్నియమంబు సెల్లదొకొ ? దండిదొరా ! యివిగో ! నమస్కృతుల్.

మ. పదియార్వేల సుగోపికల్ బిలిసి, నిన్ భాషించుచున్ బాడుచున్
బెదవిన్ గోరిన, వేణువద్దమిడి నీవిశ్వప్రబుద్ధాఢ్యమా
వదనంబున్ బరిపూర్తిఁ జూపవుగ ! తద్వంశోద్భవంబైన యా
పదమో, పద్దెమొ, గీతమో, కృతియొ, యేపారించునే మోక్షమా ?

మ. నిరుపేదల్ నినుఁగాక యొండొకని సాన్నిధ్యంబుకున్ జేరిపో
దురొ యేమో యని బోలు, నీవు సిరిని న్దోట్పాటుగా నీదు పే
రురమందున్ నిలబెట్టుకొంచుఁ దృషముల్లోకంబులన్ నిత్తైమె
ల్లిర పేగింపఁగఁ జేయువాఁడ ! వాకలీలా ? నీది ! సర్వప్రభూ !

చ. మకరిని ధిక్కరించుటకు మత్తకరీంద్రము చాలలేక "నీ
వకరుణఁ గావరావ!" యని వచ్చెడు దాఁకను గూయి యిడ్డ నాఁ
డాకరుఁడ వేఁగినావు! "సిరినొల్లను, చక్రమునొల్ల" నన్న మ
చ్చికయది! భక్తరక్షణకుఁ జిన్మయ రూపము చాలి యుంటగా!

మ. గరుడాళ్వారుల వీపుచిన్నదనియా! కాంతన్ మహాశ్రీని నీ
యురమందే యిటికించుకొంటివి? ప్రభూ! యున్మాదినై నేను నిన్
దటిమే యంతట జారిపోవుననియా తన్నారీశిరోభూషమున్
మఱుగుంబెట్టెదు కౌస్తుభంబునను! దొంగన్ గాను, భక్తుండరా!

ఉ. ఎల్లలులేని పాల్కడలికెల్ల పవంగను మఱ్ఱియాకుపైఁ
బిల్లఁడవౌచుఁ దేలి, కడుపేదుకమైఁ బొదగట్టుచుండు, నీ
యుల్లము వెంబడింబడఁగ నోయి మురాంతక! ముట్టలేను, నీ
చల్లనిచోటు మాఱెడిని; చాలను బెద్ద కరశ్యకున్ బ్రభూ!

శా. శ్రీకిన్ శ్రీకిని మధ్యనీవగుచు, మధ్యేనీకు శ్రీసంచుకొం
చో కళ్యాణసుమూర్తి! కేశవ! హరీ! యోకృష్ణ! యోయచ్యుతా!
రాకేందుప్రభ రాసనాడునెడ నిన్ లక్షింప లేరైరిగా
యాకల్యాణుల పెన్మిటుల్ సయితమాత్మాకారతన్ దిగ్గిపో.

ఉ. గంగ భవత్పదాంబుజము కందఁగనీయదు, పాదనీయ, దు
ప్పొంగుతరంగ మాలికలఁ బోవుచుఁదాను త్రిలోకగామియై
రంగ! చెలంగు; నీపదములన్ మమహస్తములంటి ధూళి రే
యంగను వెంటనేకడిగి యచ్చపుఁ జందముగా నొనర్చెడిన్.

మ. అలనాఁడెప్పుడొ యిక్షుపత్రమున గాయంబైనఁ జేర్చింపి, చె
ల్లెలు పాంచాలి యొకింత చీరయిన వ్రేలిం గట్టుకట్టంగనే
తలపోయన్ మఱిలెక్కలేని వలువల్ తద్వామాక్షికిన్ గూర్చి స
భ్యలమధ్యన్ బతులందు నామె పరువుం బోషించి, తెవ్వాండటుల్ ?

ఉ. శ్రీకర ! సింధురాట్సుతవశీకర ! రా ! కరుణన్ గరావరా
శాకర మాధురీనికర మాకరికిన్, గిరికిన్, మహామహా
శ్రీకిని గూర్చినట్టులమరింపుము, లేవనికొంత పూర్వమే ;
యేకరకల్ పడున్బడని యిప్పుడె ! యెవ్వరు వచ్చునిప్పుడే.

## ఏకాదశ సంఖ్య ౨౧-౩౧

ఉ. మాయకు మాయయై కడు నమాయకవృత్తి వహించు వాఁడెవం
డాయువు కాయువై లయభయాకృతి నెవ్వఁడు నాట్యమాడుఁగ
న్మాయక మూసినట్లిరులముంచు జగాళి నెవండు, నిత్యమా
జ్ఞేయు, నమేయు, వాఙ్మయుఁ, బిచింతన చేతు ముముక్షు సంగతిన్.

చ. విదురుఁడు శూద్రకుండగును, వెన్నుఁడు క్షత్రియుఁడౌను, అట్లయున్
బదమిడి వానియింట సహపఙ్క్తిభుజింపడె ? రాజరాజునున్
వదలడె ? భక్తిముఖ్యము, ప్రపత్తి ప్రధానము; పుట్టుకందులన్
బొవలదుగొప్ప, భోగముల భూషలనుండదు మెప్పు తత్జ్ఞుకున్.

ఉ. మోహవిముక్తులౌ మునుల మోహమువెంచి, పదాఱువేల స్త్రీ
దేహములన్ సృజించి, యలదివ్యశరీరములాడు శోభచే
మోహమువెంచఁ దాను నయనోత్సుకుఁడై తమిఁబిల్ల గ్రోవితో
శ్రీహరిగేయ మూదెనట చిత్తములందుఁ బురాకృతంబులన్ !

శా. గాథల్లేవనఁ బోకుమెందు హరిసద్గాథాళి కోటానకో
ట్లాధుల్ వాధ్యులు ఖేదభేదములు మాయంబౌనుఁజూ ! వానిచే
"రాధావల్లభ !" యన్న నీహృదయ సామ్రాజ్యంబు నేలుం గృపన్
బాధల్ సేరవు, భాగ్యయోగ్యతలు సంభావించు నీకోసమై.

శా. ప్రేరేపింపకురాని వారలను, వేవేవచ్చువారిన్ సఖా !
వారింపంబని పెట్టుకోకు, నిజ మేవాక్యార్థమందున్నదో
యేరిన్ వారినిచూచుకోమనుము, నీవెందున్ జగంబందునీ
పేరూర్ కోరను జెప్పఁబోకు, పరమున్ విశ్వేశుఁగీర్తించుకో !

చ. కుదిరి ధ్రువుండుగొల్చెనట ; కోవిదుడైన పరాశరుండుదాఁ
బొదుపుగఁబెంచి భాగవతమున్ ముగియించిన వాఁడటంట, నా
రదుఁడును దుంబురుండును నిరంతరమున్ హరిగూర్చి భక్తిఁబా
డెదరటమించి మైమఱచి ; యెందవి వేకులెవారు ! సెప్పవా !

చ. ఘనతరమౌ పురాణముల, గాథల, నాటల, నాటకంబులన్
వినఁబడునట్టి దొక్కటియ ; విశ్వమనోహరుడైన దేవు స
ద్గుణము : కనంగవచ్చునది, తోచునదొక్కటె ; యమ్మహాత్ముక
ల్పనమ : తదర్థమే యెచటి బాసలు వేయివిధాలమ్రోసినన్.

ఉ. జేనెడుపొట్టఁ నోరుమఱి చిన్నది, వీనికిగాను తిండినిన్
మానుగఁ గూర్చికొంచు, నొకమాఱు నినుద్దలపోసికోనిచో
మానిసి మానిసే నిలువుమ్రానగుఁగాని మహామహుండ ! సు
జ్ఞానముపొందఁజేని యొక సన్నికలో యొకరోలా రోకలో !

మ. రుచులారున్న గుణత్రయంబును, మదిన్ రూపింప నెంతెన్నియో
వచియింపంగలవారు భేదములతో భావించుకొంచున్ ప్రజల్ ;
రుచులారింటికి మూలకారణుఁడొకే రూపాన నున్నాఁడనన్
రుచిలేవట్టికనంగనేరువరు కల్లోలాత్మకుల్ గావునన్.

చ. జనకునిఁజంపి, పుత్రకుని జయ్యనఁ బ్రోచె, నఖండకీర్తి న
వ్వనుబొలియించి, తమ్మున కనంతరపట్టముగట్టె, నిమ్మ తె
మ్మనుచుఁబద త్రయమ్ముఁగొని యట్టె త్రిలోకము లాక్రమించెఁ జె
ల్లనుదలపోయ ! శ్రీహరిబలుండు, శరణ్యుఁడనన్యుఁడారయన్.

శా. దాచేవాఁడెవఁడయ్య నీవిభవమర్థంబిట్లు కోశంబులన్ ?
తూచేవాఁడెవఁడయ్య నీబరువు సత్తుంబోలె తక్కెళ్ళలో ?
చూచేవాఁడెవఁడయ్య నీవిలువ మంజూషంబుతోరాపిడిన్ ?
వేచేవాఁడెవఁడయ్య నీకొఱకు విశ్వేదేవ ! వాకుండఁగా ?

## రత్న సంఖ్య ౩౯-౪౦

శా. మన్నుం భక్షణ వేయుచేయుపని చెప్మాయన్న పెన్నమ్మకున్
గన్నుంబ్రామితి పేడుఁ రెండ్లుగనులో కాల్కుక్షిలోఁజూపుచున్ ;
వెన్నన్ ముచ్చిలిపెట్టి గొప్పపసరావే పీఠికన్ రాధికన్
జిన్నంబుచ్చితి చండ్లుపట్టుకటియల్ చెండ్లాటకంచున్ పడిన్

మ. అతనుంజాత్మజుఁ డౌట నిన్నతఁడు వేయంటోడు పూముల్కినేన్ :
ధృతినీకింకెటు పోవు నచ్యుతుఁడ ? కన్నీరేకమా విప్రయో
గతమంబెవ్విధినొంచు నిన్ను ? రతిసాంగత్యంబుకై యూరకే
మతినొప్పించుట యెట్లు నీకభవ ? రమ్మన్నంత రావందుకే !

మ. క్షితినిన్ శేషుడు మోయుచుండునట : తచ్ఛేషుండె నీదేహమున్
ధృతితో మెత్తనిపవ్వళింపు పరుపై యేవేళ మోపేనటా :
క్షితినీకున్ సతియంట : తా నుపరతిన్ సేవించునో నిత్తెమున్
క్షితినీమీదుగ ? లేక దానికవలన్ నిద్రించెదో ? దాంతుడా :

శా. బమ్మే నీకుఁ గుమారకుండగుట పాపల్ కోసమై వేతెమో
హమ్మున్ బెట్టక భార్యతోఁ బవ ముపోష్యంబున్ వ్రతంబున్, బ్రదా
నమ్మున్ జల్పుట నీకవశ్య మిసుమంతైనన్ గనన్ రాదు; గే
హమ్మందున్ సిరి నీకు భాగ్యయగుటన్ హంల్ చేయ దాకొమ్మనిన్
దెమ్మా వస్తువులంచు; సౌఖ్యమననీదే : యాదినారాయణా :

ఉ. నీవు పదారువేల రమణీమణులన్ వరియింప నెంచుటో
స్థావర భావమూని యలతావున గూఢతఁ గూడఁబోక యీ
భావపరంపర ప్రముఖ వాయుతరంగవిలోలవేణునా
దావృతరాగమున్ విసరి యందఱ కందఱవౌచు మత్త రా
సావరణంబులో నడుము సన్నని రాధకుఁ గౌగిలింపులా ?

ఉ. "చేరెడు కళ్ళవాళ్ళకును జీకఁటి, బారెడువెంట్రుకల్ కళల
దేరెడు ముళ్ళవాళ్ళకును ధీవర : చిక్కె : జగంబునందు సం
సారమసారమన్నపుడి సర్వమబద్ధము నాఁగ రైకతో
వేరెము పెంచుకొంచు నిటి వెల్వడు సున్ జనుదోయి వాళ్ళకున్
బేరులె : యింక మామగల వెంబరవిత్తుల చెప్పనేటి" కం
చారమణీమణుల్ నిను శరణ్యునిగాఁ దలపోసి కొంటిరో ?

ఉ. నీకయి జారభావ మెద నిండగనిచ్చిన లేదు పాప, మో
హో కరుణాసముద్రుఁడ! రహోవ్యథ గుందుచుఁ బైకి నెప్పుడున్
బ్రాకఁగ నీయకున్ననుఁ బరాశ్రయమై యమృతాశ్రుబిందువై
లోకములన్నిటన్ వెలసి లోచనగోళములన్ శమించెడున్

మ. శరదంభోధర మాలికానికర సంసర్గంబునన్ మల్లికల్
విరులన్ విచ్చుట నీదువేణురుతిలో వింతన్ వినంగన్ గదా!
పరమానందము తోఁడుతన్; యమునపై పై చంద్రికల్ కోటి చిం
దుచు లా రాత్రిఁ గాయుటల్ నిను మనోజ్ఞున్ నిద్రఁబుచ్చున్ గదా!

శా. శ్రీరంగా! విమలాంగ! గాంగజల నిక్షేపాచ్ఛభంగా! కృపా
పారాపాంగ! యనంగకారణ పరిష్వంగా! మహోత్తుంగ! గో
పీరాధారమణీమణీ పరిణత ప్రేమాతిమోదాశ్రుతా
సారారూఢపతంగ! ఏలుకొనుమీ సాష్టాంగు, నిస్సంగు, నన్

* * *

శా. ప్రారంభించినదానికిం బ్రభువ! యారంభంబ వీవైనచో,
ప్రారంభించుట లేమిటోయి భువి ప్రారబ్ధంబుగా కోహరీ!
సంరంభంబది దానిదేయగును; వాచా, సత్క్రియా, బుద్ధివి
స్తారేణా, సరుఁదొంది పూసుకొని, యాసాసన్ విజృంభించుచో

శా. పాలో పాయసమో సుపక్వఫలమో భక్ష్యంబో చోష్యంబో సి
రో లబ్ధించు బపద్పుదాంబుజములన్ రూపించి యర్పించుచున్
లోలో నువ్విళులూరువాడు దనకెన్నో మెచ్చుగా వాలటం;
చాలోచింపడు నీకు నైవలయు మేలౌఁగాక యంచింతయున్.

చ. ఒకరుఁడు పున్నెపుం గొడవనొప్పు పురాణము సెప్పికొంచుఁడా
నకలుషవృత్తిఁ గాలమొక యందముగాఁ జరిగించుచుండు, వే
రొకరుఁడు సీట్లపేక వెలయుగ్మలితో వెతనాడుకొంచుఁ దా
వికలతఁ గాలముంగడపు; వేయివిధంబులఁ గాలమాతెడిన్.

శా. ఓంకారంబును ఓనమాలబరిసే యొప్పారగా నేర్పితిన్;
ఝుంకారంబును దేటిచేయుక్రియ నీసాన్నిద్ధ్యముంజేర నే
నోంకారంబు రుతింతుదేవ : వినుమెందున్దాని కావశ్యమే
వంకన్ గావుసు : పెద్దపెద్ద చదువుల్ ప్రజ్ఞామతుల్ పాండితుల్.

మ. కనులన్ రెంటిని గాళ్ళరెంటిని బ్రభూ : కర్ణంబులన్ రెంటిఁ జే
యను హస్తంబులరెంటిఁ బీల్చముకు చాయన్ రంధ్రముల్ రెంటి, నీ.
తనువున్దాల్చియుఁ జిత్తమేమిటికొ నీతద్యస్స్వరూపంబు నెం
దును నద్వైతముగా భజించెడిని ఖద్యోతార్చు దంపద్యుతిన్

మ. కలలో బెల్లగ తెప్పలన్ విడివడన్ గన్నీరు గార్పింతువే,
మొలకెత్తింతువె లేఁత నవ్వులను, వోవో దొంగతానాయసన్
బిలవింపుం గొలిపింతె : యేమిటిది ? యీ బాహ్యప్రపంచంబు నం
దలి యీమాయలు చుట్టు ముట్టుటలు చాల్తా మాకు ? రాధాధవా !

మ. నిను గల్పాంతమునాడు జూచుటకుఁ దన్నీరంబు లీవంగ నే
రనుగాఁబోలనియా రహింతు విపు డీ రాత్రిన్ — అమావాస్య గా
ఢనవాంబోధర సాంద్రనీలతమ భీలాకార రూపంబుతో
డనుతోతెంచుచు నాదు కన్నుగవనే యశ్రుల్ ప్రవర్షించుచున్.

ఉ. చీఁకటి మాకటంచనిన జీకటినిన్ గనుగొన్నవాఁడవే
యేకరణిన్ గనంగలిగి తీవను బ్రశ్నను బృచ్ఛచేతుఁ; హో
హో! కనుచున్న దేదియును నొప్పదు నాయెడ దేవదేవ! రా
వే! కరుణించి బ్రోవఁగదవే; కనుపించవె! ఇంచవే! ప్రభూ!

చ. మునుమును ధర్మమంచు నుడిపోసిన ధర్మము నే డధర్మమై
నను, మును నాచరింపని ప్రణామము నేఁడు ప్రసిద్ధికాంచినన్,
విను! భవదీయ సచ్చరణ వేషవిలాసము నాఁడు నేఁడునున్
వినుతి యొసర్చు భాగ్యమది వేఱుపడంగనులేదు మాధవా!

చ. తెలిసినవాఁడు నిన్మఱచు దృష్టిని బల్కఁడు వెండి సత్ప్రభూ!
పలికినవాఁడు నిన్పిలచు ఫక్కిని గొల్వఁడు జాన శ్రీహరీ!
కొలిచినవాఁడు నిన్నడుగు గోష్ఠిఁదలంపఁడు మోక్షదాయకా!
తలచినవాఁడు నిన్నెడయు ధర్మమెఱుంగఁడు శిష్టరక్షకా!

* * *

శా. కౌపీనంబు ధరింపకే శుకుఁడు నిష్కాముండయెన్; శంకరుం
డా పంచాబ్దంబుల యీడుఁనాడె కొనె సన్న్యాసం బనూనంబుగా;
నీప్రజ్ఞా? యది వారిప్రజ్ఞ? యథవా! నీరేజపత్రేక్షణా!
ఓపాపాత్మున కెన్ని నాళ్ళకు హంశక్కుల్ సుమ్మీ యుష్మచ్ఛ్రుతుల్

చ. వదలక నిన్ను గోరికొనెఁ బాండవమధ్యము డుత్తవెట్టియే?
యెదిరి జయింపలేని పటికే? యని కేడ్తెఱలేని సాధువే?
మెదడదిలేనివాఁడె? ప్రజ మేటికిరీటియనన్ దలూపదే?
పదనము నీది చాటయిన వానికిఁ దోఁచదుగాక మాధవా!

మ. ఒక పూల్చెట్టునకై సతింగొనుచు నీవుత్సాహివై దేవతా
నికరంబున్ బొలియించినావనిన, నింటింటన్ స్వదారన్ మగా
డిక వెన్కోసుక రేపుమాపు జగడాలే వృద్ధిగావించి, మ
ర్త్యకదాయాదులఁగుంజుకో వెరవ దన్నన్ వాదె? యో యాదవా!

చ. యుగము యుగంబుకున్ ప్రళయమున్నవి చాలక, నీవు పుట్టుచున్
ఖగపతి! దుష్టసంహరణ కార్యభరంబు వహించువాఁడవే!
అగణిత రూపమౌ ప్రకృతి యాడుతనంబున వెంటనున్న నీ
వగౌనబుగాఁ బితామహుని భారము బొడ్డున మోయు వాఁడవే!

మ. "ఇది కళ్యాణము, రుక్మిణీలలన నెంతేఁ బ్రేమఁబెండ్లాడె; ని
య్యది నిర్మాణము, వేటగానిగుటినంతంబందె" నంచున్ మదిన్
మృదులానంద మసహ్యదుఃఖమును మన్నేత్రద్వయం బూనునో
యదుచంద్రా! భవదీయ పూర్ణవిమలాఖ్యానంబుభావింపగా

మ. వడగండ్లయ్యావి వానియంతకరగున్ వారింపనేలా యబం
చుడుగంబోతివె లోకసేవ? యలనాఁ డుద్యోగివై పెద్దగన్
దడవాక్కింతయు లేక యెత్తితివి కొండన్, గోపగోరక్షకా!
మృడవంద్యా! సహియింపలేవు త్రుటి మామేనుల్ నలిన్ నొచ్చుచో.

మ. ఒకనాఁడొప్పుగఁ జేతనెత్తికొని నీవుప్పొంగుచున్ గూర్మినీ
దు కరాగ్రంబున దువ్వగా నుడుతపైఁ దోచెన్ ద్రిరేఖల్ ప్రభూ!
ఒకనాఁడూర్జితలీల నెక్కి యహిపై నొక్కొక్కలాస్యంబు నీ
ప్రకటస్ఫూర్తిని జూప సర్పముపయిన్ బాదాలెయచ్చొత్తెరా!

ఉ. దానముగాఁ ద్రిలోకములు తావకహస్తమునందుఁ బెట్టియున్
దానవచంద్రుఁ డాబలివదాన్యుఁడు కిక్కురునెంచకుంటె మేల్
"నేనెఱిగున్నవాఁడ"నని నిక్కుచు సన్నని జారికొమ్ములో
స్థానము చూచుకో మెలఁగ దైత్యగురుం గనులొట్టచేయవే ।

ఉ. కోకలు గోలుపోయిరని కొండొక సత్కృపఁ గ్రొత్తకోకలన్
మ్రాకునకెక్కి చూప, ననుమానము నీవయిఁబుట్టి గోపికల్
కేకలఁ గూకలన్ తమవి లేవని, పోవని, తొల్లి ప్రాతలన్
సాకిడి రంతెః నీవగుచు సందెటనెత్తెడె కట్టుగుడ్డలన్ ।

శా. వేదాల్ బ్రహ్మపఠించు, వాణి తనదౌ వీణన్ నినాదించుః న
మ్మోదంబెవ్విధినుండు నొండొరుల కింపుల్సొంపులెట్లౌ ? ప్రభూ !
నీదౌనాభితలంబురంగమయి నీనేత్రద్వయంబచ్చుగా
నాదంబౌనపుడెల్ల చూడ్కులను జ్ఞానంబీనకే పోవుచో ।

* * *

శా. కౌశల్యాంబకుఁ బాయసంబవయి, చక్రిన్ గర్భమున్ జొచ్చి, నీ
సౌశీల్యంబును క్షాత్రధర్మమును, రక్షస్సైన్య సంహారతా
కౌశంబొప్పఁగఁ జూపినావుః పెఱియోగంబందు శ్రీకృష్ణ ! యా
కౌశంబందునఁ దేజమ్మెల్లపగి యొండంబన్ విడంబించితే ।

ఉ. మేఘరుచుల్ నినుంబోలుచు మించిరనంగవ కార్చునీరమో
యీ ఘనుడా ! ననున్ ; ప్రకృతి యీఁదతుపానగువంకదార నా
శాఘృణినై యెదుర్కొని, వసంతుని యూలరచింతువీవుః నే
నో మటమృత్తికాభరము మూనుదు శంఖము వంకబిత్తికన్.

ఉ. చిత్తము నిన్ను జేరుచునె చేరని యట్టుల చింతచేయు నీ
షత్తృష, చింతపుల్లి బలె చచ్చినఁజావని దౌటచేత; లో
కోత్తర ! ఆత్మకద్దనెద, వున్నది దేహమటందు; రెంటినిన్
రిత్తలుసేసి చూపెదవు వృద్ధిలయంబులు నీదుసొత్తుగా.

ఉ. చీమకు దోమకున్ జిమట జీవముకున్ గరికిన్ మృగేంద్రుకున్
బ్రేమకు తిట్టుకున్ నవుకు నేడ్పునకున్ క్షుధకున్ సుతుష్టికిన్
గామముకున్ విరక్తికిని మౌనముకున్ వసపోత వాక్కుకున్
నామముకున్ బ్రణామముకు నందునినందన ! హేతువీవెకా !

శా. అంధుల్ పంగులు భిక్షుకుల్ బధిరు లన్యాయంబు నీచేతచే
నిందోయందునొ యెందొయైనటుల నేడ్చెరయ్యో; నేరర్గనన్
బంధంబేమియులేకయే పగలు బ్రహ్మాండంబుగాఁ బమ్మనం
బంధుండొప్ప దివాంధ మన్ బులుగు కంధంబన్న నైజంబునన్.

మ. ఉదయంబందునలేచి పుష్పాకటి నేనూహించి దర్శింప నీ
వదనంబున్ గనుగొన్న మచ్చగును, దేవా ! దాని మెత్తందనం
బదిరా ! యంచునుతింతు, దానిసొబగజ్జారే ! యటంచందు, ద
న్మధువున్ దేటులు గ్రోలిజుమ్మనగనే మన్నింతు నీతియ్యమున్.

ఉ. చిత్తమునీది, నేను తవసేవకుడన్, ననునేదిచేయ నా
యత్తము సేసికొందువో, తయారు ! మహాత్మ ! జోహారు ! దేవరా !
మత్తుడ మావటీడవయి మానక శిక్షణ యిచ్చుకొమ్ము; నే
వత్తను బాగుగా బలియభక్ష్యములన్ సమకూర్చుకో ప్రభూ !

మ. మదికాపేక్షలులేనిమాటనిజమా? మార్తాండమూర్తీ! భవ
త్పదపంకేరుహమార్దవంబునకునై తాపత్రయా లోలునై
యెదియో పద్దెమొ, గీతమో, కతయొ, నే సృష్టించుకొంచున్, దా
యదెలోకంబనిపాటిచేసికొను చాసాసన్ బ్రపంచించుచో?

మ. ఇది రాత్రీచర భూమియన్న మది నే నిక్ష్వాకునింగొల్తు, న
య్యదిసాత్రాజితి సౌధమన్నహరినత్యాసక్తిఁ బూజింతు; నె
య్యదికాదెల్లయు శూన్యవంతయనశూన్యాకారునిన్ సేవచే
సిదరింతున్ భవహారకా! త్రిభువన శ్రీకార! తెల్పంగదే!

చ. సరసతయన్న నీయదియ, సఖ్యమటన్నను నీదె, బంధులన్
గరువము సూపుటన్నయది, కంజదళాక్షుడ! నీది, శత్రులన్
వెరువక చంపుటన్న నది విశ్వమనోహర! నీదె, ఎందుమే
మొరలము లాతివారల మొహో! యురియాడగ నేల మామతుల్!

* * *

ఉ. చక్రమనంగ శార్ఙ్గమన శంఖమనంగను కౌస్తుభంబనన్
నక్రముకుం భయంబులవి నష్టములయ్యవి వక్రగామికిన్;
విక్రమ కారణంబులవి విష్ణువుకున్ జగదేకజిష్ణుకున్;
సక్రమ భూషణంబులవి సద్గుణశాలికి సాధుశీలికిన్.

ఉ. చక్రము భూమిపైఁ దిరుగు సాధన, మచ్చపునంతు సంద్రపుం
బ్రక్రియ, నీటిలోఁ బెరుగువస్తువు, రెండును రెండుచేతులన్
జక్రిధరించువాఁడనిన; సర్వమయప్రభ చాటఁగాదె! ని
ర్వక్రతనాతఁ డొప్పు భువిపై, జలరాశిని, నెందుఁ జూచినన్,

ఉ. మించు దయాంబువుల్ గురియ మేఘరుచిన్ దనుశోభ లొప్పునో ?
ఎంచుక్షణంబులో నెగిరి యిక్కడనుండఁగఁ జిక్కనెక్కెదో ?
మంచిసిరిన్ భువిన్ దనుప మానక లచ్చి నురానఁ దాల్చెదో ?
పొంచెడు పాపపుంలత సమూలము ద్రుంపను జక్రమూనెదో ?

చ. హరునకుఁ గళ్లు మూడమరినన్, సువిశాలత రెండుకళ్లు శ్రీ
హరికినొసంగి నీరజదళాక్షుఁడితండని యంటయుక్తమే ?
శిరమునగంగ శంభు కిడి శీతలచంద్రున కందు నీదనున్
సరసతఁ జూపి విష్ణుపదసన్నిధి నన్నది పేత నీతియే ?

ఉ. నామము నీదు మోముపయినా ? మఱినాదము నంకువంకనా ?
నీమపుఁజూపు శ్రీపయిన ? నేరమునాపయినా ? ప్రభూత్తమా !
కాముఁడవంచు, గంతమున గట్టిగనార్చెదనంచు, నెందునే
జామున బేరు మోతకృషి జల్పెదు ధంభుజనంచు, బాపురే !

చ. 'హర'యన సాంబుఁడంచు, నొకయచ్చునుదానసమార్చి శ్రీహరీ
"హరి"యని వేఱుసేసికొని యాత్మ, దలంచుచు మీకచెల్లున
క్షరముగుణించు వాదులకు ! సాగదు నాకది వల్లగాదు ! మీ
గరహిని గొల్పి యెందు ననుగంతము నెత్తగనీదు బత్తితా.

శా. గోదానంబులు భూమిదానములునున్ గుప్తార్థదానాలు సేన్
మీదేచేతులుగావు? శ్రీశుకరుణన్ జేదోయినిన్ మోడ్చుచున్
మీదై యుండెడు గొప్పకావలయుఁగానీయంచు, నేనెంచుకొం
చాదార్ఢ్యంబున నిల్చియుందు నతినై హస్తాలు జోడించివే.

శా. శ్రీకాంతా! యదువల్లభా! బహుళసుశ్రేయోభిలాషీ!హరీ!
రాకాచంద్రనిభాననా! మమమనోరాజ్యాధిపత్య ప్రభూ!
నీకున్ మ్రొక్కుచు నీకుఁదక్కితిని! నీ నీరేజపత్రేక్షణం
బాకర్ణాంతము దేల్చి భ్రూకుటుల విన్యాసంబు సారింపవే !

శా. పద్మంబుల్ భవదంఘ్రు లక్కఁజేతు లాపాంగ ప్రణేతల్ ! భవ
త్పద్మంబాకన! మాత్మకింపొహొహో! నీయాకార మీక్షింపఁగా!
పద్మావిర్భవు నీదుబిడ్డనిగఁ, శ్రీ పద్మాక్షి నిల్లాలిగా,
పద్మశ్రేష్ఠముగన్ వికుంఠపురమున్, జాటించుటాశ్చర్యమే !

ఉ. నీటికెఁజేప, ధారుణికి నిష్ఠురపుంగమఠంబు, రాక్షసున్,
మాటిగఁ గొమ్ముతోఁగెడప సూకర, మాస్తికతన్ నృసింహ, మే
వాటికిఁ బెద్దపిన్నయను వామనరూపు, బహుప్రకారముల్
చాటఁగ రాముకృష్ణబుధసంజ్ఞలు, కల్కిమాయ నీవెగా !

* * *

ఉ. ఎంతయసహ్యమో బ్రతుకదెంత వికారము దెచ్చిపెట్టునో
యింతయు నేరఁబోరుగద, సూక్ష్మపుఁజింతలు, వెంటవెంటనే
కాంతసుతాది బంధుజన కల్పన,మంత యెపాటు, లంతర
ధ్వాంతసుసంస్కృతిన్ మెఱుపు, లామెడ నాకలి రామచంద్రుడా!

ఉ. నీతికిఁ బెద్దవీవగుట నేరము మాయెడఁగల్గఁ గాచుటే
ఖ్యాతికి లక్షణంబనుచు, నల్లన నీదగు నుల్లమార, మే
మో! తెలిగద్దనెక్కుబలుపోటరి! విన్నపముంబొనర్చు కొం
చూతగనిమ్ము నేకొలుచు చుందుము! జాలిగనీకుమమ్ములన్.

ఉ. రాఘవ! రామచంద్ర! సుర రక్షక! దైత్యవిపక్షకా! ప్రభూ!
మేఘములాగు నామనసు మిక్కిలి మారుపునొందుచున్న, దా
మాఘపుమాసమందు నిలమాకులురాల్చెడునాకులాగు! బెం
డై, ఘనతన్ మనోజ్ఞతను ఆయమునేరక యున్నదేలొకో!

శా. నీకున్ దగ్గఱ మేనబావలు, మహా నిష్ఠాగరిష్ఠుల్, కడున్
వీకన్ జాలెడు వీరవర్యులుగదా విశ్వేశ! యప్పాండవుల్
చాకుందగ్గను లొట్టపోయినటు పుత్రాదుల్ వినాయుద్ధమం
దేకాకారత వారు ద్రోవదియునై యెంచేత శేషించుటల్?

చ. ఎదిరి జయింపలేననెడు నెక్కుడుభీతి కిరీటికేల? వి
న్నెదిరిజయించు కర్మమతనిన్ బొడగట్టమినేమొ రక్షకా!
చదివి జయింపలేమనెడి ఛాందసబుద్ధి యదేమిదేవ! ని
జదివిజయించు మర్మము ప్రజన్బురికొల్పమినేమొమిక్కిలిన్.

మ. తనకూతుంగొనిపోయి యచ్చట బరున్ద్వాసుదేవు న్పరుం
డసుఁజొప్పించిన నయ్యశోద కడునానందంబుతోఁ బెంపఁగా
రణమేమౌను? పరాత్పరుండగుటగా! రంగారు రంగయ్య యుం
డినఁగన్నమ్మకుబిడ్డపై మమత హృత్స్నితంబ వేర్పాటయౌన్.

ఉ. నీవు భువిన్ నరుండిలె జనించి చరించెడువేళ నీకు నం
భావనశంఖచక్రములు బాహుచతుష్టయమున్ గదాదులున్
లేవని యానవాలుగొనలేదు జగం బని విన్నబోకుమా!
నీవపునీలమేఘరుచి నే యెఱుకెక్కి విముక్తి గాంచె మున్.

చ. మరుఁడనమాటకారిసుమ మత్తశుకంబెకిరింతగా, యతం
డెరుగడు నిద్రయన్నది నిశీథపు దర్శిలి మేనమామగా,
వెరువడు పూవుటంపజడి వేచగ విశ్వపరాక్రముండు శ్రీ
హరిజనకుండుగా, సకియ! ఐన ఋతుప్రభ నీద వానిదా?

మ. తిరిపెంబెత్తు శివుండు పెండిలికినై తిప్పంటి చెట్టంగొనెన్
గిరిజాతన్, హరితాను గష్టపడతే క్షీరాంబుధిన్ సత్వరన్
సురలన్ రక్కసులు లిచ్ఛద్రచ్చు నెడల, న్మోపట్టు శ్రీలక్ష్మినిన్
బెరిమంబెండిలియాడెఁ, గాని నిలుపన్ వేవేలు తంటాలిటన్!

చ. శివుని శిరోజమాత్రమగు చిక్కనివ్యోమము నీకు దేహమం
దవిరళమైన ఛాయగుట, యాతని కంఠమునందు మాత్రమే
తవిలిననాగుబాము నిడుదన్ నిను మోయుట, తెంచి గాంచినో
భవహర! యెంతకెంత కనుపట్టును నాకన, మంతకంతకున్
మిపులును శేముషూర్జితమమేయమునయ్యవి రెండుకూడనున్

అవతార సంఖ్య ౯౧—౧౦౦

ఉ. గాలమునంతరింతు వలకై జతనంబును జేతుఁగాక! లే
దా! అలి నూతదిన్నదు! నిదానమె దానికిఁ జిక్కకున్నచో
గాలికిఁ జావనెత్తి ఁబిగితర్రను దొల్చిన నావమీద నా
శాలలనామణిం గలపి పోగెద నాగెద మత్స్యమూర్తితో!

శా. ఆగేదెట్టులు? కూర్మరూపమదె! యెం దైయుండు నేనిప్డొహో!
ఆగంభీరమహాసముద్రమె యిదీ! అయంబువే! ఆయతే!
ఏగడాదారియదేకదా! జగతిపై నెవ్వారు మాటాడరేం?
వేగంబోయె దునాదిసూకరము! నేవీక్షింతు దానిన్ ద్వరన్.

శా. అమ్మా ! నిర్చితిభూమిపై ! కటకటా ! యాసూతరప్రాభవం
బిమ్మాత్రంబునె భూమిచుట్టి, యెటు నింతేన్ జోటు లేకుండఁగాఁ
బొమ్మంచున్ బడద్రొబ్బునం చెఱుఁగ నంభోరాశికేపోదునా ?
అమ్మయ్యో ! దరిఁగాన నంతయును, సంధ్యాంధంబు నల్దిక్కులన్.

ఉ. ఏమిరయీపెటిల్లు ! పగులెయ్యెడ ! నుక్కున ! నిక్కవంబుగా
నే ? మహిఁగంబమందుదయమే నటరా ? భళిరా ! నృసింహాసు
స్వామి ! ప్రభూ ! నమస్సు ! కృపఁబా లనచేయుము ! పిల్లవాఁడనే
నేమియునేర, నీయునికినేర్చుటతక్క సమస్తమందునున్.

శా. నాతోనాడగఁ జిట్టివామనుఁడవై, నాతోడనేయుండ కౌ
రా ! తోరంబుగ మూడులోకములకున్ వ్యాపించి పూర్తించితే !
చేతోమోదము పొందువారెవరురా ? సేవించు వారేరురా ?
నీతో సద్దిగనుండ నీవెలుగు క్రీనీడైన లేదేమిరా ?

మ. ఒకరాముంగనుగొంటినాన్ ! వెనుక నిం కోరాముఁడా ? వెన్కవే
రొకరాముండ ? మహామతులు మీలోలేని దేమున్నదీ
సకలోర్వీతలమందు ? మీచరితముల్ – సంస్తుత్యముల్ సమ్మడీ !
ప్రకటింపంబడెరేఁబవళ్లు చెవిఁగుప్పంగూర గ్రంథంబులన్.

శా. కానీకృష్ణుముఖారవిందమునకై కందోయి కాంక్షించెడిన్,
ఆనీలాంబుదమాలనేతెరగఁ గొన్నాడా ? ముకుందుం డరే !
నానాభంగుల వీచుగాలులకు విన్నాణంపుఁ బింఛం బదేన్
జ్ఞానంబచ్చుపడంగ నాడదట్టరా ? చాలున్ దధాలోచనల్.

ఉ. బుద్ధుఁడవైతి, నైతివని బుద్ధుఁడ వీవయి పంతగింతువా ?
సిద్ధుఁడవేని : ఎందుకిటఁ జెప్పెద నీకలిమాయ సంతనున్,
యుద్ధము సేతువా యునికి యుండదు నీకిల, నెయ్యమూను చో
బద్ధుఁడ నీవచఃప్రభువు, బంటయి విన్విదనాడ నెన్నడున్.

ఉ. మద్దెలనయ్యెదన్; హరిరో ! మంచివికంచువి తాళముల్ సదా
యొద్దిక నేనెయయ్యెదను, నొప్పుగమువ్వలు నేనెయయ్యెదన్,
నిద్దపుఁ బాటనయ్యెదను, నీయమగానఁగ లేచు ధూళి వే
నద్దెమచీరనయ్యెదను ! నాడుము పాడుము చూడకెవ్వరిన్.

చ. భజననొకండు పాడునెడ, భక్తిమతొక్కఁడు తాళమూను, నో
యజనుత ! యింక నొక్కరుఁ డపశ్యమునృత్యము సేయువాఁడు, మా
టఁజొరగనీరు నాకు ! కనులన్ బనుపంగనునీరు, పద్దెపుం
సృజనయొనర్పనీరు ప్రజ ! చేసెదదేమిటి నేనునీకిఁకన్ ?

---

రచన అప్పటప్పట
24-7-1932 నుండి
5-9-1932 వఱకు

సర్వం సంపూర్ణము

స్ఫురణ
శ్రీమద్భాగవతము

# నిరంతర ప్రార్థన పద్యము:

—: 0^0 0 :—

ఎవ్వాని కొఱకు కోయిలపిట్ట యెలుగెత్తి
కొమ్మ "కోకో" యని కొసరువిసరు;
ఎవ్వానికై సెలయేరు జల్జలమని
పెనుకొండలోయఁ బింపిళ్ళుగూయు:
ఎవ్వానిపొంతె యుయ్యెలదూగు చిటిపాప
మవ్వంపుచిన్నరి నవ్వు నవ్వు:
ఎవ్వానిగూర్చి హాయిగ పేదగోపండు
గుల్లపిల్లంగ్రోవిఁ బల్లవెత్తు;

అట్టి చిద్రూపమూర్తికనశ్వరునకు,
సకల జంగమస్థావర సాధుజీవ
కలిత సద్భావ సరసకళాలయునకు,
పురుషసూక్తున కంజలిపుటి ఘటింతు.

—క॥ వేం॥

శ్రీరస్తు

# సమైక దైవసంప్రార్థనము

కవి కొండల వెంకటరావు

## తొలినవకము

తే. గీ. సూర్యభగవాను భంగి నన్ జూడనిచ్చి
కృషిని జేయించు నాచేత ధృతిమెయిఁ బ్రభు!
అల్లధ్రువసునక్షత్రంపు టధ్వమట్లు
నాదు దారి తప్పనిది తిన్ననిది గూర్చుఁ
అస్తమించు చందురు భంగి నతిరహస్య
మతినిరాడంబరమగు విశ్రాంతిఁ దెల్పుఁ
దేవ! నీదు దయారూప మానిశాఖ
మాస మధ్యాహ్నవర్షంబుమాడ్కి నన్ను
నిరతమును జల్లఁదడుపంగ వరమొసంగు. ౧

మ. గగురుంబాటున నిల్చువెండ్రుకలు తీగల్ గాఁగఁ స్వేచ్ఛన్ ద్రుటిన్
వగలంగారెడు బాష్పమౌక్తికము లంతస్స్థాయికిన్ బూసత్తె
సొగసుం దేల్పఁగ నాశరీర మిది నీచోద్యాలయం బంబురె
నిగమానంద సువేద్య! మ్రోగునది మన్నింపంగఁ జెల్లన్
శ్రుతిన్. ౨

తే. గీ. దూరమునకు దూరముగనుందువు మునుపంచ :
చేరుగడకుఁ జేరికవయి సేవగొందు ;
పట్టి నినుఁజేరి సేవ సేయుట్టి చేతుఁ
జూపుసారింతు దిక్కులు ప్రాపులుగను ౩

శా. సంతోషాశ్రులు మంచుగా గురిసి, నాచక్షుల్ ప్రవర్షింపుఁ, బో :
చింతాబాష్పములన్ మహోష్ణముగఁ సీచన్నై సచో రేంటిసిన్
శాంతిన్ దాంతినిగూడఁ గట్టుకొని విశ్వాప్తా : భవద్బింబమున్
సుంతేఁజూచుటకో : చూడలేను నిను నాచూడ్కుల్ సతా
ర్ద్రంబులై. ౪

శా. కోటీందుల్ రవికోటు లింకను సుడుల్ కోటానకోట్లూరకే
చేటన్ జల్లెడ నెత్తి పోసినటు నీచే దిర్దిరన్ దిర్గుచున్
నీటంగూలుట నేత్రుఁగా కభవ : వందేత్వాం ? భజేత్వాం ; ననున్
నాటంబోదొకనాటి శాంతియును నీనవ్యప్రభారంభునిన్. ౫

శా. నీలోలేనిది లేదుగాబయట నిన్నిర్మాణమం దన్నియున్
నీలోనేలయమందుగా తుదకుఁ; బానీయంబులన్, బృథ్వినిన్
గాలిన్, నిప్పును, నాకసంబును మహా కారంబుతోఁ జూపుచున్
లీలన్ మాయము చేయుచుందు నిను గుర్తింపంగ రా దాకృతిన్. ౬

సీ. జలధికల్లోలముచ్ఛలమౌ తరంగంబు
జలధిలోనే శాంతి సమయుఁదిరిగి;
భూమిలేచిన మొక్కఁబొడమిన చిగురాకు
కారాకుగా మారి ధారుణిఁబడు;

ఆకాశమున దిక్కనవకాశమిచ్చిన కళ
యాకాశమున దిక్కులరసి త్రుంచు;
దారపుత్రాదులఁ దవిలిన మమకార
మవ్వారికొలుకగు నాత్మనిముడు;

నీవె నిత్యుండ వజనుత ! నీవెమాప
నుండు వెవ్వేళనచ్యుత ! నీకడుపున
నీకు వెలుపలఁ బుట్టిన నిఖిలవస్తు
నిచయమును నశింప నేమౌను ? మిగులు దేవ ! ౭

శా. చూతున్ నిన్ను మహాసముద్రమను పయస్సుల్ పట్టిపోనిమ్ము ఖ
ద్యోతుల్ చంద్రపయోధరాదులును విద్యూతాలుగానిమ్ము భూ
పాతాళాది సమస్తలోకముల దీపాలార్చిపోనిమ్ము మ
చ్చేతోమోదము నిన్ను జేపశయమున శ్రీభాతినొప్పారెడిన్. ౮

ఉ. వందనమాదిదేవ ! సతి ! వాసవవంద్య ! జోహారు ! సచ్చిదా
నందుఁడ ! సత్ప్రకాశమయ ! ఘనాఘన శీతలవత్సలాఢ్య ! మ
ధ్యందినభానుతేజుఁడ ! నమస్కృతి ! వందనము ! నిశ్చలుండ ! ని
ష్పందకటాక్ష ! యంజలి ! తపఃప్రతిభుండ ! నమో ! నమో !
నమో ! ౯

## ములినవకము

మ. కనుతెవ్వానిది చూపఁజేయు మనలన్ గర్వాంధులన్, విద్యమా
పనుతెవ్వానిది లేపనెత్తు మనలన్ భస్మప్రదగ్ధాంగులన్,
గొనబెవ్వానిది కాంతిగొల్పు మనలన్ గోచారకూటస్థులన్,
జనులారా ! యలసర్వసిద్ధుని భజింపన్ రండు నాతో రహిన్.

చ. ఎవనిగృహాంగణంబున వచింతురొ మూగలు, పంగులై పవాం
డ్రెవనిసమక్షమందెగిరి యెన్మిదియంగములన్ భజింత్రొ, గ్రు
డ్డెవనినిదానమున్ బడసి దృష్టిరహింతురొ, యట్టివిస్మయున్,
గనిసుతు, లోకవంద్యు, మమకార వికారుని, భక్తిగొల్చెదన్. ౨

ఉ. దారిద్ర్యంబునఁ గుందువానికిని, ధెందంబందు సందేహమై
యారాటంబును బొందువానికిని, విద్యాబుద్ధులంగల్గి యెం
చూరుంబేరును లేనివానికిని ముందో వెన్నునో చూతువే;
నాటుంటోసినవాఁడు నీరిడఁగ వండన్ విందుకుండన్ బలెన్. ౩

చ. కలిమి యశాశ్వతంబు, దొరగర్వము నిల్వదు, వేరమెచ్చు కే
చెలిమి, విలంబపన్నగిలు, సృష్టిలయించును, నిత్యమైన వి
ద్యల్లలనొక్కఁడేని గానఁబడ; దెందుకు సంపదిమమ్ము ద్రోయకో
ఫలరహితా! స్వకర్మపరిపాకవిజేత! పితామహా! పితా! ౪

చ. ఎవనిది యీశరీరమున నెప్పుడొ తల్లి గతింపఁ, దండ్రియున్
దనిలెడుమిత్తి, తాతలును తాతలతాతలు జ్ఞప్తికేన్ గనన్.
మివులరు; నీవొకండవసుమీ! యలయందఱకాదివన్నచొ
ప్పువుచు రహించువాఁడ వెద! అంజలి నీకు మహానుభావుడా! ౫

చ. రగులఁగనీకు కర్మఫలరాశిని; రాగములెత్తనీకు, మీ
కుగొనమె నీగుణంబు ప్రియసోదర! చూడుము చెట్లు గాయుటల్
పగలగుటల్, ప్రశాంతిగను వాహినినీరము జాలువాఱుటల్
మొగిళులు వానలన్ గురిసి, భూమిని బచ్చనఁజుచ్చు టర్మిలిన్. ౬

మ. మఱువన్ రానిది, మాటిమాటికిని సంభావించినన్ బూర్తిగా
తెఱుగన్ రానిది, లేని, దున్నది, బహిః ప్రేమంబుకున్, మానసాం
తర రాగంబుకుమూలమైనయది, సత్యాధారమైనట్టి, దు
త్తర పూర్వాంశములెల్ల నేర్చినది, వార్తన్ జెప్పుచున్నట్టి ద
య్యరుదౌ దానిని, ఆత్మశక్తిని, తటస్థంబైనదానిం భజే ! ౭

చ. సకలమువాఁడు నేనె, యిది సత్యము ! నమ్ముడి నమ్మకుండుడీ:
యొకరుఁడ నేనువాఁడొకరుఁ డొప్పుగఁగూడినవొక్కరుళ్ళ మే
వికలతలేదు మాకెపుడు, విశ్వము కంతకు నుండుఁగాక; వాఁ
డకుటిలుఁ డాదిసంభవుఁడనాది మహాప్పురుషుం; డెవండ నేన్?

శా. భావజ్యోతికి నూనె, వత్తి, ప్రమి, దానాసంబు నానేమహా
భావంబూరక ప్రజ్వరిల్లునదొ, లో ప్రజ్ఞప్రసూనంబునున్
దీపై, చేపయు, శేవయున్, సొబగునై తెలించునో, సౌరభ
శ్రీవిస్తారత; నా మహావిబుధమున్ ప్రేమింతు గామింతు నే. ౯

## మూఁడో సప్తకము

శా. నూరేకారపుపాలు మానవునిలోఁ జూపట్టునట్లో మహో
దారా ! నీయెడనిట్టియిట్టి కనుచో దగ్ధంబుగాదే జగం;
బేరే నేఁడ లే నిమేషమున నేన్ హృష్టుండ నీవెప్పుడున్:
నేరంబెంచవు కోపగించవు; ప్రసన్నింపన్ భజింతున్ నినున్. ౧

శా. చెట్లన్ ప్రేళులు భూమిలోఁ జలుపకై చీకాకుగా నల్లి కొం
చట్లైయిసుకన్ శిలన్ దిరుగుచందానన్ మనుష్యుండునున్
గొట్లాడుచుఁదనభక్తికోస, మయినన్ గొందాడకున్నే నినున్
పట్లాదిన్ బువులాకులన్ దొడిగియింపుంగాయ శాఖల్ బలెన్. ౨

శా. సింగారింగొనుచున్న వాఁడెవఁడు? వేభిన్నంబుగా వానికై
వెంగన్ బాష్పములొత్తుచున్న దెవఁడి స్త్రీ? యంతె సంసారపుం
సింగారంబులు! వానికోసమయి ప్రస్వేదాదులన్ దేహితా
పొంగుంబాటుల వోర్చియూడ్చుకొన సంబద్ధంబె? సర్వేశ్వరా! ౩

శా. ఆయుర్దాయమొసంగి దేవ! నిను సత్యాసక్తిఁ బూజింప నే
నేయుద్దేశ్యము దెబఁ బుట్టితినొ దానిన్ జేసికొన్నిమ్ము; నే
తేయీభూమిపయిన్ జనించుటలు, నన్ లేపింప, చావుండ ని
న్నైయైక్యత్వముఁబొంది ముక్తిగొనునట్లీశా! ప్రసాదింపుమా! ౪

ఉ. లేపుము నన్ను ముందుగను; లేపి ధనత్రయమే మొ వేయఁగాఁ
ప్రాపుగనుండి పంపు, మనురాగము సూపుము నాయెడన్ ప్రభూ!
తేపనుజాగు బుద్ధినిడ కెప్పటిదప్పుడు చప్పుచప్పునన్
నీపనిగానొనర్పుటకు, నీతనిశక్తిని ముక్తినీయుమా! ౫

శా. ఒయ్యారంబెటనున్న నందమది యెందోహో! యనన్ దోఁచినన్
జియ్యాల్ నేర్పిన చిత్తనిగ్రహముతోఁ జింతింతుఁ; గాపట్యమున్
నయ్యాటందునసేవిచూపను ప్రభూ! సర్వజ్ఞ! సత్యద్రుమా!
కయ్యంబిన్నను లాలుదువ్వను, నను గాపాడుమా సర్వదా! ౬

శా. ఆనందంబొకయప్డు పుట్టునెడ నిర్వ్యాజంబుగా, నజ్ఞతన్
గానంబొందొకవేళ నుప్పతిలు రాకన్ రాకయిట్టే యొహో!
జ్ఞానంబిచ్చుపడున్ దనంత నొక యుచ్ఛస్థాయి లోనెంచకే,
మానంబుల్కలుగుల్కునొక్కొకతరిన్ మేతే యెఱుంగన్ ప్రభూ!

ఎవ్వానిగూర్చి నేనెనగింతు సవ్వనా
నీవు తోచెదవెద నిఖిలధవుఁడ ।
ఎవ్వానిగూర్చి నేనెనగింతు నూహనా
నీవు తోచెదవెద నిత్యసఖుఁడ ।

మవ్వపుం వెన్నవీవ । నామానసమున
జవ్వనమునీవ । సరసనభ్యత లోహో ।
నీవ । నీవ సమస్తంబు । చేవ తేవ
లీవ । జీవకళవు నీవ । నీవ శ్రుతివి । ౩

చ. సకలము నీయధీనము; విషాదము మోదములేదునాకు, నీ
యకుటిలరాగ సంపద ననామయమౌను, చిరాయురోన్నతిన్
బ్రకటితమౌను, సర్వమును పావనమౌను మహానుభావుడా ।
నికటమునందు నుండి నను నేరనివానిగ నేలుకో సదా । ౪

మ. నతసుల్లల్ సురువుల్ మహాంబుధితరంగవ్రాతపుం బ్రోతలన్
జతగాఁజేసుక, భూమినిండుచునుఁ జాటించు సంశంబు గో
వ్రతసం బెయ్యది ? యేమిటే దిసుక త్రిప్పన్ మాయమౌటేకదా ।
కృతకంబీమని కీవచస్ఫురణ జొక్కింపంగఁబోకో ప్రభూ । ౫

చ. విడువనునిన్ను నేమడిషు, వెర్రిగ వాగను నిన్నుగూర్చి, నే
జడుడనుగాను ప్రాజ్ఞునని చంకలుగొట్టుక విర్రవీగనోయ్ ।
తడవులబట్టి నీకృపకు దాసుఁడనయ్యెద, నిన్నునమ్మకొం
చడరెడువాడ, నెవ్వరికి నందకయుండెద విశ్వమోహనా । ౬

శా. భూమిన్ నీవెలమిన్ సృజించిన మహాభూతాత్మకంబైనయా
రామంబుల్ నదులంబుధుల్ గిరులు తీర్థంబుల్ పురంబుల్ గుడుల్
ప్రేమం బారగఁ బూర్తిగాఁ గనిన వాఁడేదీ? యొకండేన్? వరం
ధామా! స్వర్గము జూచువారలట! వింతా? వెర్రియా? వేదురా? ౬

చ. యశమునకై ప్రయాసపడ, సస్యలుసన్ గొనియాడుకొంచు నా
వశమును నుండబోవరు; నిబద్ధుడఁగాను సిరిన్, దదిచ్ఛలో
నశనముకున్ విభూవల కహోయని యాశ్రితులువ్విభూయునే
నిశనిశవిందు; శాంతమును స్థిరమైనది నీప్రకాశమే, ౭

వ. ఒడలెరుగన్ మహాత్మ! నిస్సినొక్కెడ నిదురబోను! మొద్దువ
ప్పుడు! ననుగాచుచున్ మబలఁ బొద రుబాద్యుతిఁ బోచువేళలన్
జడిమనడంచి, నన్ గ్రియలఁ జాలెడువానిగఁ జేసికొంచునున్
విడువనినేర్పు నీయదియ! నీవువినా యెవరయ్య నాకిఁకన్? ౮

## అయిదో సప్తకము

ఉ. ఏయది సర్వకాలముల కెక్కటి సత్యమొ, యేదినిత్యమో,
యేయది పంచభూతముల కేకమయై పనిపెట్టిపంచునో,
యేయది నీవు నేననక యద్వైతమే లోసరించునో, సదా
యాయమలాప్రమేయము మహాశ్రయమై విలసిల్లఁ గాపుతన్. ౧

మ. నిను గోల్వన్ బురుషార్థమంద్రు విబుధుల్, నీవేమొ దూరంబుగాఁ
జనుచున్ ముట్టకముట్టకిన్నయటు విశ్వంబందు వృక్షంబవై,
తనవృక్షంబునఁ బుష్పసౌరభమవై, కానంతియాగాలిలో
వనయం బొండొక తేటివై దొరకవయ్యా! వేయుతావెక్కడో? ౨

సా. ఛాయాచిత్రమునీకు నొంటి సరి పోల్చన్ దీయలేం ! అంత నీ
ఛాయే ! వానికి వెల్గుకావలెను; నీ సౌందర్యముం జూచుచున్
వ్రాయన్ నేరడు చిత్రకారకుడు; ఏవ్రాసేటివాడేని వె
ల్గేయెందును ఛాయలేదని యనున్; లీలాప్రభావా ! ప్రభూ ! ౩

ఉ. ఆగదురా ప్రవాహమది యంబుధితోడను సంగమించు దా,
కాగతినామదెంద మెుగ యార్ద్రిత నిన్నుఁజేగూడముట్టెడిన్;
నీగొనబెందు ? నీదురమణీయతరంగములెందు ? నెందు సం
యోగము నీకునా ? కభవ ! యూపెద నిన్ రసమంజరిన్ ప్రభూ ! ౪

చ. వినబడు విశ్వనాదమొక వింతగనంబుధి నీట, చెట్లకొ
మ్మను, పనిలానఁ, బక్షియసమానపుటెక్కల విప్పనందు, మిం
టను మొగిలందు, వానపడుటన్, మనుజుండువల్కుటన్ !
నినువినునట్లెపంతతము నెక్కొను సంతసమాత్మ నీశ్వరా ! ౫

మ. ఎదినీలోఁగల ? దేదినన్నదరు ! నొందేమున్న దీ సర్వమం
దుపధిన్, భూమిని, నాకసంబునసుదివ్యాల్ నిల్చులోకంబులన్ ?
ముదమేపారగ తత్సమస్య ప్రతిజామున్ దోఁచుగానీ జవా
బొదవన్ బోదు ! జగత్పతే ! సకలముద్భూతమ్మొ యొక్కొ
మ్మడిన్ ! ౬

మ. కురిపేచల్లని వానకాళ్లగన నాకోర్కెన్ జాచి, కళ్ళెత్తి, పే
నరయన్, గన్పడునెత్తిమీదను వినీలాంభోధరశ్రేణి; త
త్వరచంచద్యుతిశోభగాంచను గదా తన్నీరనీలాంబుదాం
తరమార్గంబగపించు, నొక్కొకటి నీతధ్యాలటే యీశ్వరా ! ౭

మ. ముతియాలెప్పుడు లోతునీరముల నంభోరాశినే డాగునా ?
కుతికంటున్ జిగిగ్రుచ్చఁజేరి, సఖినింగోమించుగాకెప్పదేన్ !
అతిరేకంబయి నీదుమూర్తి విభవంబారఁభమందూరకే
శ్రుతులన్ సుస్మృతులన్ బురాణములనున్ శ్రోతవ్యమైదేవ ! నా
మతులన్ దేరకొనంగనోపనిషః డిందున్ మర్మమేమున్నదోయ్ ॥౭

ఉ. మ్రొక్కెద నీపదాంబురుహముల్ ; మమశీర్షముమీద రేణులన్
జక్కనరాల్చి, హాపకియజస్రముగమ్మఁ బరీమళంబుగా
జొక్కెదుమన్న ! నీదయనిశోభనరూపము జూచువాడ, నే
ప్రక్కనుతారగా విభవజాలవ్రాతకు వ్యాఖ్యచెప్పుచున్. ౮

## ఆ రో న ప క ము

క. వేధకు నాధారుండెవఁ
డాధారుండెవఁడు జలధి, కాధారుడెవం
డీధరణిఁ జిలకకు మొలక
కాధార్మికుఁడలఁడు నాకు నాధారునిగా. ౧

క. సాధారణజడునకుఁ, గడు
మేధశ్శాలికి నొకరమణీయాకృతిమై
సాధనగపడువాని, న
సాధారుణు, గణుతిసేతు సమధికభక్తిన్. ౨

క. ఆమయములేని వాని, మ
హామాయావృతు, నమాయకాగ్రణి, సమర
ప్రేమామృతు, సుకృతు, నభ
స్సీమావరణ విహృతి పరుఁ, జింతనచేతున్. ౩

క. తెలుపవయని నేననుకొనఁ
జీకటిలోఁ దడుములాట సేత తుదకదో;
వాకొనుచునుంటిననుకొని
మూర్ఖతనము మెఱుగఁగన్న బుద్ధిపొడము వే. ౪

క. వీనులకు విందు నీరుతి,
జ్ఞానవికసనమ్ము సృష్టిసర్వము నీదై;
మానితము నీ ప్రబోధము,
నీనియమంబెవ్వఁడు దాటనేరఁడు దేవా! ౫

క. కోరికలు కూడవనుచునె
కోరెద నీదర్శనంబు కోమలుఁడ! మనో
హారుఁడ! సంసారమ్మునఁ
బారంబవు నీవయగుచుఁ, బాలించుననున్. ౬

క. సకల ప్రారంభములును
సుకరముగ ఫలోన్ముఖములు సూర్యోజ్జ్వలుఁడా!
అకలుషమతినిను దలచుచు
నొకనికిఁగాని తెలుగునను నొనరించునెడన్. ౭

క. ఇయ్యది యాదియనంగను
నెయ్యది మదిదట్టు, నింక నెయ్యదితోచన్
ఇయ్యది యంతంబనుకో,
నెయ్యది నాడెందమందు నలరెడుఁగాతన్. ౮

క. చాలాకోరినవానికిఁ
జాలాయిడి, చాలునన్న సరిపుచ్చవాహో!
మేలాపయు జేవనిగా
జాలికసులఁ జూతుదేవ! జగములనెల్లన్. ౮

## అరుణోదయకటవనవకము

తే. గీ. ఆశయుంబుల కాశయ, మాశలకు ని
రాశ, పూర్వజన్మంపు సువాసనరహి
తాత, ఏతిరెఁజేతికు చేతినంబు,
అట్టి శక్తిని గొల్తు, నేగుట్టు దెలిసి. ౧

తే. గీ. ఎన్నొయితరభాషలు వల్కి తెనెఱుంగ,
ఎంతమందినో యెఱుఁగ నీ యిలపయి. మఱి
ఎన్నొయూహాల యర్థంబు నేనెఱుంగ,
నేనేటెంగితి ననుబెట్టులీశ! నిన్ను? ౨

తే. గీ. కావ్యకల్పకపుష్పాలదివ్యమాల
నీదుమెడవై చువాడ నో నిర్మలుండ!
శాశ్వతముగఁ బాడునయ్యది, నమిధితి పరి
మళము, నాహృదయముది, సిమమునవిడుచు. ౩

తే. గీ. అఖిలకళ్యాణగుణమయు, నమలు, సర్వ
భువనసువ్యాప్తు, మునికుల పూజితు, ఘను,
పరనిరాడంబరవిభువుఁ, బరము, నసిఘు,
రెండుచేతులు జోడించి, యెఱుఁగొలుతు. ౪

తే. గీ. నిత్యు, నిరవకాశుని, రమణీయచరిత్రు,
సత్యవీరు, వికాసు, విశాలు, నవలు,
పృథులగంభీరు, కావ్య సర్వేంగితు, గురు,
మ్రొక్కువాఁడను సాష్టాంగముగను బడుచు.

తే. గీ. తొలుతఁ జిన్నపు కాకిచేఁ ద్రోసివేయఁ
బడినపికము, పిదపనెట్టు పొడుగుకొమ్మ
కెక్కి హాయిగాఁ బాటను జొక్కినదియొ ?
ముజ్జగంబులకును నీవయొజ్జవు ప్రభు !

తే. గీ. కల్పితుండవుగావు; అనల్పముగను
లోనవెలసి, యాత్మప్రభ పూనుదీవు !
కల్పకల్పాంతములదాక పిల్పనకును
పందనట్టివాఁడవగుచు నుందువంతె !

తే. గీ. తఱిమివేయు మవిద్యను, తఱిమివేయు
మీమహానుభావుండ ! సమీరమువడి
నెండుటాకు లెగురఁగొట్టు కృతియనంగఁ
దఱిమివేయు మవిద్యను దఱుము ! తఱుము !

తే. గీ. చిన్మయాకార ! సద్భక్త చిత్తచోర !
త్రిభువనాధార ! ధీర ! సందేహపార !
పావనోద్ధార ! వివిధరూపావతార !
రార ! ననుగావరా ! సృష్టి రమ్యసార !

## ఎనిమిదోసప్తకము

ఉ. ఎక్కడికక్కడే పొడగు లెక్కడికక్కడె మేలుచేత ల
మ్మక్క! భవత్ప్రభావమును మానసమందునఁ బిక్కబట్టుకొం
చొక్కెడఁ గూరుచుండుటెటు? ఊహలసంగను లేనిపోచెవన్;
మిక్కిలిగన్ శ్రమంపడుచు మేదినికిం బొనరింతు సత్కృతిన్. ౧

మ. కన్నీళ్ళన్ దుడిచిల్లిచున్ జిరునవ్వుం గావింతు; సందండు నే
పెన్నాదంబున సీరవస్త్రతుల స్థాపింపన్ సమర్థుండనే;
విన్నాణంబును జాలఁగొందు, బెదురున్ భీభత్సమున్ దట్టినన్;
ఇన్నెన్నాళ్ళకు నేమఱన్ బ్రభువ! నాసీమధ్య మీకా యేమిరా? ౨

మ. ఎపుడాలం బెదియాకసం, బెవగునాన్ పృద్ధ్వీచురున్, గాదునాన్
దుడయో, సత్పురుషున్ మదిన్ దలతు; విద్యుచ్ఛోభి మేఘంబును
న్నదలేదా యనుచింత యేమిటికి? సంజ్ఞామాత్రవిస్పోట సం
పద శ్రోత్రేంద్రియమున్ గదంబుఁగన లుప్తంబయ్యెఁ బెంపెక్కటిన్. ౩

ఉ. గడ్డిఁగలిట్టి పువ్వులను గొల్చెడపోగకముందు నాకహో!
దొడ్డగఁజూపి యడ్డమిడి త్రొక్కెడ త్రోవను జేసిఁ కొమ్మఁటం
చొడ్డెను నీదు పందెమును ఓకరమాత్మ! యప్రమేయుఁడా!
గొడ్డుగఁజేయవైతివను, గ్రుడ్డిగనైనను జేయవైతిమో! ౪

ఉ. ప్రేయసు లెందఱో కలిగి ప్రేమరసాత్రుడొకండుఁగాఁగ నే
ప్రేయసులందఱిసున వివేకముదప్పుదు రొక్కొకళ్ళు; న
ట్లేయయిపోదురేమొ భువినెల్లరు, నొక్కెడ పీడబంచుసున్
గేయము పాడుకో! కనుక కీర్తనచేసెదనైకమిప్పుడు! ౫

చ. వినబడునొక్కచో విబుధవిశ్వము పెద్దగఁ; వింతసొంతమై
కనబడునొక్కచోటఁ; బెనఁగాఁగనఁగానెటుఁ దోఁచదొక్కచో
టను; ప్రభు! మందునన్ జనకులక్షణునన్, ననుమేలుకొల్పుమా
యనయము; వందనంబు భవ! యవ్యయ! యాదిమకారణోదయా! ౬

ఉ. చందురులోని చాయబలెఁజావదవిద్య మమాత్మదేవ! నీ
సుందరసత్తమింపవలె ముక్తిపథంబున, నంతవట్టు నన్
జెందివసించునట్టిద, యిసీ! పచ్చిచీకటి పోవగాక చీ
కందె కృశించి శిష్టమయి యప్పటికప్పుడె వృద్ధిఁ గాంచెడున్. ౭

చ. పెరుగపురాలు; తాముసద స్వేచ్ఛ యెఱుంగవు చెట్లు; తల్లులన్
మరచెడు జంతుజాలము క్రమంబుగ; నైనను నాకు వాని కే
యరమరలేమి దేవ! భవదాత్మరుతించును నెల్లచోట్ల నా
క్షరహానిఁ, గొంతలోయఁ, బువ్వుకమ్మనఁ, దుమ్మెదమ్రోత,
నానుడిన్. ౮

ఉ. తెల్లని మేఘమాలదిగు తెన్నునఁ బైపడిఁ బౌర్ణమాస్య జా
బిల్లి మనోహరాస్యము! విచిత్రము! నాదగుమోహ యీశ్వరా!
ఉల్లమునిండియుండి, తనయోచనమున్ వెతలించుచున్నదా
తెల్లమొగుల్ పటున్నదచి తిన్నగఁజంద్రుని దాటిపోకన్నై. ౯

## తొమ్మిదోనవకము

ఉ. కొమ్మలెవానికోసమయి గొప్పగపువ్వులు పూచునట్టివో,
యమ్మలయానిలమ్మెవనికై చలువన్ విరజిమ్మునట్టిదో,
దుమ్మడగించి మబ్బెవనితొందఱ వానను గ్రిమ్మరించునో,
యమ్మహిమాఢ్యు నీశుని ననారతమున్ భజియింతు మారకే. ౧

చ. చిఱుతలఁ గొంద, ఱూరకయచేతులఁ గొందఱు, కొందఱెంతయున్
గరిమను గంచుతాళములఁ, గట్టిగ దంబురతీగ మోతలన్,
సరిగమపాదనీపలను, జప్పుకుమద్దెల ధిమ్మధిమ్మలన్,
గిరిశు భజింతు; రక్కటను గంటము నీకును మూగయయ్యెనున్. ౬

చ. పలుకను నేను, పాడనిక, భావనచేయను గూడ, నమ్మ! నీ
నిలుకడ నీడనీరవపు సిగ్గును జగ్గును, నాడు కన్నులన్
మెలకువ మూసికొంచును, సమేయముగాఁ గనుగొందు; నుల్లమం
దలముకొనంగఁ జేసికొని హాయిగఁ దన్మయదీప్తి నొప్పెదన్. ౭

ఉ. వేసగియందు వానవలె, వేగమవెన్కవచ్చు కీర్తియు,
ట్లాసపెసన్ బయల్పడెడు పిల్లయదృష్టము భంగి, నేను నీ
కోసము చూడనప్పుడొక గొప్పగఁ గన్పడుచుందు వో ప్రభూ;
మాసము వత్సరంబు తిథి మంచిముహూర్తము రావులెక్కకున్. ౮

౬. దోసవకము

శా. సందేహంబెటులేదు; నీవుగల వీ సర్వప్రపంచంబునన్
సౌందర్యంబెటుచూడఁ గన్పడగ నక్షా! ఛాయలందిచ్చు; వా
నందంబే యెటుపొల్కుచున్న, మఱి సత్యంబే ప్రకాశించెడిన్
డెందాలన్, ప్రభు! నీదు సత్కృపయ పాలించేని మాయాత్మలన్. ౧

శా. శ్రేయోదాయక! ముక్తసంగసుర! సచ్ఛ్రీకార్థి గంభీరుఁడా!
న్యాయప్రాభవ! సాధుకర్మరుక! ధన్యస్వామి! దుర్జేయుఁడా!
ఆయుఃప్రోద్భవుఁడా! మహామహుఁడ! మోహాంధాపకుఁడా! దివ్యుఁడా!
సాయంబొచును దిన్నగా నడుపు క్లిష్టంబౌ సమస్యన్ ననున్. ౨

ఉ. ఎల్ల జనుల్ సమానులని, ఎక్కువతక్కువ, తొల్లి విప్రులే;
దిల్లి జీతంపు భూమిసుతు లెక్కడ సనుండిరో వచ్చి, సమ్మతిన్
జల్లని విత్తసంబు క్రియ సాగి, ఫలించో ఫలించకో ప్రభూ!
ఇల్లు పతివ్రత: దొక్కనిసుం గోరిన ఓవికె ముక్తి సిద్ధమా. ౩

శా. ఆరోగ్యంబిడి యున్న నెంతపనియైనన్ జేతునం జొక్కడుం,
దూరోమాన్య మొయున్న నెందతికొని త్యోపాధికల్పింతునం
చౌరా! మొక్కుచు, విద్దెయున్న నభము దాపాపసుంజేయనే
యీ "రాతే" మని పేత్తొకం, దటులనీ పృచ్ఛన్ విచారింత్రుగా!
కారంభంబుల దావిమూల మెవరయ్యా? నీవకావో ప్రభూ! ౪

ఉ. పూనినవాడు తానువశమున్ జెడి గంతులువైచువాడయున్
వీనులదక్షుచిత్పుడుల వింటను నడుమువచ్చ నీనటుల్,
నేనినునెంచి మైమరచి నేర్చియు నేరకొ పల్కులాడినన్
జానుగ విశ్వతోముఖ సునాదమునే జతకట్టుగొంటిరా! ౫

మత్తకోకిల—

కన్నులిచ్చినయందుకో ప్రభు! కాంచమందును కన్నులన్,
నిన్ను జూడగ మిన్నువంకను, నిన్ను జూడగ నేలనున్,
వెన్నువంకను జూడమందును, వేదవంద్యుడ! వాలవోయ
ఎన్నియుండిన నన్నిటా వలె; ఏల? పద్ధతి రెండునున్. ౬

ఉ. పాములు, పెద్దపుల్, కోవధి పాటులుపోటులు, నీటిముంపు, లా
ద్దామమునం బిడుగు, లగ్గి, రుజ, ధారుణిపైం జెలరేగి, ప్రాణి కన్
బ్రామసుచు శిక్షపెచ్చేదిని, పాపదైవము! యేమిటన్న నీ
మోమున గోము చూపుచును మోదమునే వెలయింతు వందునున్. ౭

ఉ. ఎట్టెటు పుట్టు నట్టులె యెక్కడిదక్కడె యుండుగాయి తాన్ ;
ఇట్టు నెటుంచి పెంచిన ననేమిర ! తానణువంగలేము ; వేఁ
గొట్టినఁ బట్టినన్ బహువుకున్ మతివర్ధిలదో దా కింతయున్ ;
అట్టులనన్ను జేయక యహా ! నరజన్మము నంగిప్రాచితా ! ౪

చ. దినమణి మెప్పు కల్లవియ, తేజము నిన్నను నేడు నొక్కటే
కనుటకుఁ గ్రొత్తదోఁచు నదిగా ! ఎటు ? మేఘము వాటునుండి వే
జనువుఁ బుట్టి మాయమగు చప్పెరువుం గొలిపించుచుంటఁగా !
తనుఁదెలియన్ మహాత్మ! యవెఱిన్మల, జీవులదేహమాత్మమున్. ౫

ఉ. భూమి జతంబు; తానదకఁ బోవదు, వల్కదు, కుక్కదట్టి దా
న్నామెడపట్టి గెంటినటు లాపక యూరకద్రోసి సంద్రపుం
పీమలగుట్టగా నిలిపి చెల్లరె ! మోదువతంగఁ జేతు ; న
న్నామెయి నేలచేయ ? "పిసుమైనను మే"లనుకో తరింతుగా ! ౬

ఉ. ఏహ్యపుఁ తెల్లనాయి సరికేడ్తె బితో రవితేజమూనునో,
దేహమదేది బద్ధముదీర్పక వృత్తిని ధర్మమూనునో,
యూహయ దేదినిద్దుర సముద్భవమైనది పోకనిల్చునో,
ఆహ్వదిదేహమూహయు మహాత్మక! నాకిడె బోవ నిత్తమున్. ౭

చ. గొనములు మంచిచెడ్డననుకో, సిరిగొప్పది కొద్దిపాటి దం
దనుకొని యెంచుకో, నరుల కారయ; నీ మెతఁ గానఁబోను రా !
తనవిషమున్ విషంబనుచుఁ దాల్చక వీడునె త్రాచుబాము ? నె
త్తిని మణియుంచనిమ్ము! మమ దేవ! నినుం గొని యూపఁ బ్రొక్కెదన్. ౮

చ. అణువును భాగహారమున నర్థముగా మఱి పావుమాత్రగా
నొనరిచినన్ బ్రపూర్ణముగ నొప్పుచునుందువు నీవు తద్విఖం
డనమునః బ్రహ్మకేని మఱికందనివాఁడవు లోకమాన్యగా!
వినయమునన్ బ్రణామములు వేలొనరించెద నేలుకోననున్.

రచన అప్పటప్పట 2–9–1932 నుండి 20–1–1932 వఱకు

సర్వంసంపూర్ణము

స్ఫురణ ప్రార్థన మందిరాదులు

శ్రీరస్తు

# శతధా

—:o:—

కవికొండల వేంకటరావు

## ఉద్బోధ

శా. ఏరూపంబున నంధకారనిసినేన్ దృష్టించుకొంచున్, సతం
బేరూపంబున లోకమందుగలయన్నింటన్ ప్రవర్తింతు, నే
వేరూపంబున "అస్తి అస్తి" యని మాయింపింతు సోహంశ్రుతిన్
ఆరూపంబునుగొల్తుఁ బిల్తు, హృదిసత్యజ్ఞానముద్దీప్తిగా ! ౧

శా. చింతన్ సంతసమెవ్వనిన్ దలఁపగాఁ జేకూరు; విత్తంబులే
వంతన్ వింతగనెవ్వనిం దలఁపగాఁ బ్రాప్తించుసద్యంబు; యు
న్నంతన్ జాగములెవ్వనిన్ దలఁపఁ జేయన్ బుద్ధిప్రేరేచు; న
య్యంతిస్థప్రభు, లోకరక్షు, మహాయజ్ఞేశు గీర్తించెదన్. ౨

ఉ. పరము, మహానుభావు, సురవంద్యు, ననిందితు, లోకనాయకున్,
గురు, సదసద్వివేకపరు, గూఢపరాత్పరు, నిర్మలంపుటం
బరు, కమనీయగాత్రు, పరమానపవిత్రు, జగన్నుతున్, నిరం
తరశుభశోభితున్, నిఖిలనాట్యవిశారదు, మ్రొక్కెదన్ మొగిన్. ౩

## శపథము

శా. దోసంబుల్ తలపోయరాదనుడి, నెద్దున్ మొద్దునై తెన్గునం
దేసంస్కారములేక, పద్దెములలో తెక్కించి నేఁజెప్పుటన్
భాసిల్లున్ ప్రజలెల్లరున్ జదువగా; వ్యాఖ్యానముల్ చూచున
భ్యాసంబక్కఱలేదు; వీనుగవనా వాక్యంబు విస్పష్టమౌ.

## దేవుఁడు—మతము

శా. దేవుం డొక్కఁడు, భావ మొక్కటి, పదే దేవుళ్ళు భావాలనన్
దేవుళ్ళాటయె కాని, జ్ఞానమది సిద్ధింపంగఁ బోదెరికిన్;
శ్రీవత్సంబున నున్నవాఁడనుడు; కాశిం బొల్చునా తండనుం,
ద్వాపర్తంబును నీ మేఘమును, డీయందంబాటుఁడీబూడెగా।

ఉ. ఒక్కఁడు శిల్లి చుక్కను, మఱొక్కఁడు తెల్లి నిగనామ, మింక
కొక్కరుఁ డెద్దుగీటుఁ, బరుదొక్కఁడు సిల్వి బెండకాయ, వి
ల్లొక్కఁడు మోముపై నొకనికున్నది లేదని యింతు, రన్నిటన్
సక్కనిదేది? బ్రహ్మ తొలినాఁడున వ్రాసిన వ్రాత యొక్కటే.

ఉ. నాలుగు వేదముల్ పలుకునాదము "సత్యమహింస" రెంటినుం
జాలును పుణ్యమార్గమునకు; సత్యమహింసను సర్వమున్నదో;
శీలితనన్నదుంచుటలు సిద్ధమహింసయ: సత్యమాత్మగాఁ
గ్రాలు, నహింస దానిఁ బరిరక్షణచేయు శరీరమై తగున్.

ఉ. రక్తము గోసినంత యొక రంగు జగంబున జంతుకోటికిన్;
ముక్తికి నాసఁగ దేవతలు ముప్పదికోటులు; వారివారి య
వ్యక్తతబట్టి పూజనలు, భావన, లర్చన, లారగింపు, లా
సక్తు లసంఖ్యముల్; కనముసఖ్యత సౌహృదభావ మింతయున్.

చ. మనసము భజించు చయ్యములు, మార్గములయ్యవి యెంత వేఱయున్,
దనువు వకాస్పదంబయిన ధారుణి యెల్ల అటుల సమంబు సూ ।
ఉనికి సబద్ధముల్ ఈ మదముల్ పెనుపొందుకొలం కొకం చెకా ।
ఇనుపవిష్ణు ఋవ్వి చందురుని నేర్పడఁ గ్ల్చెడు నట్టివయ్యనున్.

ఉ. ఇంతనపంతయై, కలిమియించుకవల్లని ముజ్జగంబులున్
బంతిమమీఱనడ్గికొని, "బాపురె! వామనరూపమాయిదా
సంతతనారదాదిముని సన్నుతవైష్ణవమూర్తిగాని" యం
చెంతయు మెచ్చుకో బలిపితే యొకనాఁటికిమీవు మున్నహో! ౧౫

చ. ఇరువదియొక్క సార్లు ధరణీపతులందఱినిన్ జయించి నీ
కరమరుదౌ పరాక్రమము క్షత్రియవంశజుడైన రాముకున్
బరము నెరుకున్, క్రకశసునకుఁ బంపితివెంతటి నిర్గుణుండవో!
పరశుధరుండ! వాసహార! వైరివిదారణ! విప్రమానవా! ౧౬

ఉ. రాముడటన్న నొక్క! యభిరాముడు సీతకు, బ్రహ్మకుంభరం
ధాముడు, శంభుకున్ నిరతితారకనాముడు, మౌనికోటికిం
గాముడు, రావణాసురుకు భంజనభీముడు, భక్తికల్కికున్
క్షేముడు, ముక్తినిల్పకు విశుద్ధమహాత్తరహోముడున్నతిన్. ౧౭

మ. "యదువంశంబునఁబుట్టి, మాధవునిగాఖ్యానింప రూపించునీ
మృదుపాదద్వయిగజ్జెలందియలున న్మ్రోల్కొల్పుచున్నాయి,యి
య్యెదకున్ జేర్పరనీదుచేతులన నెంతేప్రేమతోరాధ ప
య్యెదకున్ జేర్చిన నీవయోవిభవమగ్గింపంగఁ గవ్వించెదో! ౧౮

ఉ. చక్కనిచక్కభార్య, తలిపన్నులుపేషని ముద్దుబిడ్డ, పెం
పెక్కిన రాజ్యసంపదఁ ద్యజించి, తపోగరిమంబు పేత పే
రెక్కి, వసుంధరన్ మతమునేర్పడ బోధనచేసి, నీతినిన్
మిక్కిలి గొల్పినట్టిషు, నమేయుని, బుద్ధునిగొల్తు నిత్తెమున్. ౧౯

ఉ. ఘోడా పైజవరాలి నాలిసిదమిన్ గూర్చుండగాఁబెటి తో
ట్రోఎన్ ముందఱదారి దీయుచును సత్యత్సాహియౌ కొడుకై
చూడంగన్నులు లేనివృద్ధపితరుల్ శిక్షించి, పెన్కాలనే
యేడీవాడని యేడ్చువారు; కలిపర్త్రింపంగఁ జిత్రంబుగా ! ౨౦

చ. పదియవతారముల్ పరుసఁబట్టి నుతించుటకాని, నిన్నె ఱ
క్కడెలియ నింకనుంబనియుఁ గావుగ వందలువేలు వర్ణనం
బు దిరముగా రచించినను బూర్తికిరావు మహాచరిత్రుఁడా !
యెడియని యెంతదాక వివరింతుఁ బురాణములే నిరాశగా ! ౨౧

## సద్గుణస్తవము

చ. వెలుగువకున్ దివాకరుఁడు, వెన్నెలకున్ శశిబింబమట్లు, వే
పలుకుల కాదిమూలము భవత్పదపద్మములీశ ! యిందుమే !
జలములఁ జెట్ల జేమల, విశాలతనొప్పు బయళ్ళ, గొంపలో
యల, నెదలందు, నెందనిన నిందెదుటం తువు నంతతంబునన్. ౨౨

చ. కడు నిపుణుండవు నీనిపుణకార్యముఁ మంచు దెంతయున్
జడుడగువాడు నీజడిమ సన్నిధినొప్పెడు జాగరూకతన్,
వడిగలవాహినీప్రభువు, వాయువు, వహ్నివి, యొక్కవంక; నా
క్కడలను మొద్దురాతివలయిన్మహత్తోకటిబండ వుర్వరన్. ౨౩

శా. అగ్నిన్ జల్లనిపర్వతంబు పయికాళాంతాలకున్ గుప్పటల్,
భగ్నంబౌటలు పెద్ద పెద్ద కెరటాల్ వారాశినీరంబులన్,
లగ్నంబున్ దలపెట్టి సిద్ధపడఁ గార్యంబొండుగాకుండు, టు
ద్విగ్నంబౌటలు ధీరచిత్తములనున్, విశ్వేశ ! నీలీలలా ? ౨౪

మ. అధికారంబని యెంతవానినయు నీయాధిక్యమున్ మించలే
దు; ధనంబున్ మిగులంగనున్న నినుజేపోయిన్ బ్రణామంబు చే
యు, ధనాఢ్యుండొహో! ప్రజ్ఞయెంత కనినన్ యుష్మత్ప్ర
[కాసంబుముం
దధమంబంచుఁ దలంచువేత్త, భగవంతా! నీయనంతంబునన్. ౨౩

చ. బలిమిఁబల్లనున్ బలకపైనిడి వ్రాతనుజూపుమాడ్కి నీ
ఖ్యాలఁగల మోహబంధముల నెంతయు మూర్ఖులరాచి, నీవు వి
తెలివిని సుబ్బోవోవిబుధ! దివ్యగుణంబని నీదొ మాదొ నాఁ
జెటిపెదు క్రొత్తగాఁ బలకచేసినమాడ్కి నగమ్యమైచనన్. ౨౪

ఉ. ప్రేరణలేని కార్యమొకవేళ నొనర్చినఁ గారణంబు లో
నారయనీవు తోఁచవు; నియంతవు! దానినిమొల్చుగడ్డి తా
ధారుణి గాలినాడి, పువుదాల్చి, వికాసముగొన్నజాడ నీ
చేరచిఋంపఁబడ్డని, నశింపనిదన్న, నమూల్యభావమా. ౨౫

ఉ. భువికిన్ జల్లనిమందమారుతము లబ్బొవీచుఁ, జంద్రుండునున్
రవియున్ జుక్కలునున్ మెఱుంగులును నానాకాంతిపుంజంబులన్
భువికే తార్చెడుఁ, జెట్లు తీగెలు పొదల్ పుష్పంబులన్ రాల్చెడిన్
భువిపైనే, భువిపైనెదేవ! భవదుద్బోధక్ ప్రభల్ చేతలున్. ౨౬

ఉ. ఎండ యసహ్యమా ఋతువునెవ్విడిఁ జెట్టులుదాల్చు లేఁజివుర్?
మెండగువాన నెవ్విధిని మేకొను నగ్గిపిడుంగు లుర్విపై?
గుండ్రని తెల్లచందురుని కుక్షిని నల్లనిమచ్చ యెట్లు? నీ
చండతరానుశాసనము చాటుటకై యిది యెంచకున్నచో? ౨౭

ఉ. చల్లనిమొద్దుమేఘమును నాదమువెట్టుచు, వానచల్లగా
జల్లుగ భూమిపైగురియు సత్యమితత్వమొసంగి తద్దిరా ।
వెల్లువసేతుదాని నొక విశ్వమనోహరమాతటిల్లతన్ ।
తెల్లమునేతుదాని నొకతేజపుసంపును నేడు రంగులన్ । ౩౦

శా. ద్వైతాద్వైతవిభేదముల్ మనసులోఁ బరీక్షింపఁబోనేను, నా
చేతోమోదము నీదుమూర్తి జగద్విల్పంబునం దేకమై,
ప్రాతఃకాలము సూర్యరశ్మి నెదురై చంచల్లు పద్మంబుపై
వాతాంతాహారములాగి గంధవహమై భాసిల్లు లాగొప్పెడిన్. ౩౧

చ. సకలచరాచరంబులకు జన్మము పెంపులయింపు నీవ యీ
శః కలములోడ వ్రాసిన, నిశాతకుఠారముతో రచింపినన్,
శకటముమీద వర్తకముసాగగఁజేసిన, నాగటిన్ దువన్
బెకలివి మొక్కపాతినను, విశ్వము నీదికదన్న ! కొల్వగన్ ౩౨

శా. నీకై యెవ్వఁడు కేలుమోడ్చునతఁడే యీతడాద్యుండగున్,
నీకొండెవ్వఁడు ప్రాకి యెక్కునతఁడే కొండాకు వాడౌనుగిన్,
నీకై శైవ్యఁడుముట్టి ప్రొక్కునతఁడే కాలాంతకున్ దప్పెడిన్,
నీకుండాపటనిల్చి గొల్చునతఁడే బందస్మితుండౌఁప్రభున్. ౩౩

చ. విభవము శాశ్వతంబనను, ప్రేమలు శాశ్వతమంచు నాఁడఁబో,
నభమును భూమిశాశ్వతములౌనన, దెయ్యవిశాశ్వతంబులిం
దుభుఖిని జెప్పుమాయనిన, దుఃఖముసౌఖ్యము మానవంబుపై
ప్రభావ లిఖియించిచూపు ప్రతిపద్యము శాశ్వతమందునేనాగిన్. ౩౪

ఉ. చందురునుండి వెన్నెలను, జాగ్గొను పెన్నదినుండి వేగమున్,
గందుగనుండి చూపులను, గంజదళమ్ములనుండి మెత్తనన్,
సుందరినుండి జవ్వనము, శుద్ధమనస్కునినుండి సత్యమున్
సందొనరించి పాపెడువిసంధిగ నిన్నెదఁ గోలుపుచ్చుటల్. ౩౫

చ. తరువులు శాఖ హాగి ఫలజాలము లందఱికందగా భువిం
గరముఁరహించు చొప్పు మమ కంఠము గేయము పాడుకొంచు న
య్యెలుక సమస్తలోకముకు నింపుగఁ బంచిగ నుత్సహించు, దే
వః యతివినీవుగా, పరమభావము నీవుగ, కంఠమీవుగా ! ౩౬

మ. మలయాద్రింగల మంచి గంధమది కొండన్ బట్టి తానొక్కచో
వెలయంబోదుగ; దిక్కులన్ బవనముల్ వీవన్ బిసాళించు; న
ట్టులె నీవెక్కవసున్న నీదయలు ముల్లోకాలకుంబర్వు : మా
టలు వేయేటికి ? నివులేనిదిలపై 'శం' లేమ 'ధం' లేదురా ! ౩౭

పు రా ణ చా తు రి

ఉ. రావణుజంపె రాముఁడన రాములనెత్తుకపోపు టుడ్గిరే ?
భూపలయంబునం దెప్పుడు పున్నెమునెన్నెము రెండునుండుటో :
పోవవి ; గుద్దులాడుసవి : పున్నెమునెగ్గున దెల్లవేళలన్ :
దేవుగొనంబు పున్నె మలదేవతలాతని మార్గవర్తనుల్. ౩౮

ఉ. అమ్మృతము దేవతల్గొనిన యందముచందమదేమి ? రక్కసుల్
తిమిరముభంగి జుట్టుకొని తిప్పలుపెట్టుచుఁ దిస్నదాని వాం
తముగ నొనర్చుచున్నప్పడు,-తద్విధిలాభములేమ విద్య, కో
పమునునుగాఁగలట్టి యలపామరవృత్తులు కూడపుట్టినెన్. ౩౯

ఉ. దొరకవు, దొడ్డగన్ దొఱకితో శివునెక్కటిపర్యటనన్, జగా
మెఱుఁగటు మోహినీతరుణి మేనుసఁజిక్కి తదీయమానసం
బు రహిని జూఁచగొంచు నొకమోసముచేసితి, వింకమాకు మా
కెఱుకకువత్తువా? నిజమికీయనియనుకొఁగనిత్తువా? ౪౫

ఉ. సాధనసిద్ధియన్న నలసాధనకుంబయి సాధనంబు నీ
బోధనచేత నబ్బెడిని; పున్నెపుగార్యమిదన్నదానినిన్
శోధనచేయునీగరిమచూడ్కులు మిన్నగఁగానితోఁచ, రా
ధాధవ! కేశవా! యభవ! దైవయునా! విభవా! కృపాజనా! ౪౬

శా. దత్తాత్రేయుడవైన నీవ, కరినిన్ దాక్షిణ్యభావంబుతో
ముక్తిన్ బొందగ నీక కాచు హరివేనిన్ నీవ, యుల్లెత్తులో
నెత్తావందున నున్నవాడవొ? మహాంఁల్లాలిసెన్ ద్రోపదిన్
'వత్తున్వత్తు' మటంచు జాగిడక ప్రోవన్ నీవరబ్బెన్నటన్. ౪౭

శా. వేదాంతుల్ ఋషులాదినుండియును నిన్ వేదాలనాదాల, "నో
రాధావల్లభ! మాధవా! యనుచు దీర్ఘాలాపసంబోధనన్
శోధింపన్ దొరకొంచు గోపికలు, రక్షోనాయకుల్ వైరులై
బాధంబెట్టుచు, నీదుమూర్తిగనినార్! పాటింతునెవ్వారినిన్! ౪౮

శా. శ్రీరంగేశయనంగనొక్కపడు, విశ్వేశాయటంచన్న నే,
'డోరామప్రభో' యన్న, నొక్కపరి, డోహోహో! శ్రీహరీయన్ననేఁ,
డౌరా! నెమ్మది కింపుగొల్పెదవు; నన్నే చేయు సంబోధనన్
బ్రావంభంబది గద్గదస్వరమయున్ భావింపుముద్దీధగా! ౪౯

ఉ. కన్నులులేవు నీకనినకంజసుమాప్తుడు కల్పతేడు నీ
కన్నులుగాగ దట్టుదువు, కంటికి నీకును గానరాని దే
మున్నది ? దేవదేవ ! నినునొక్కడుహామొఱగింప లేడుగా
యిన్నిరకోటియందు, రవియించుకమోపున వెల్గు వాడుగా ! ౨౩

మ. ఇవినాదేహము, వీరలాలుమగ, లీయిందఱుం బిల్ల, లీ
పదిలంబైనది యిల్లువాకి, లివి నాశ్యాలుమంచాలు, కొం
డ్రిదివర్యంబివి, గోవులివ్వియనుచున్ తేఃందుమాపందునన్
వవలంబోని మహాభిమానమున దేవా ! నిన్ను గాదంద్రరే! ౨౪

మ. మనకన్నుల్ గనుచుండఁ గట్టెదుటఁ గొంపల్ గూల, కూనల్ చనన్,
వనితల్ బాయగ, భర్తలుందొలగ, సంపాదించి గోప్యానమం
చినవిత్తంబు హరించ, నింకనెవియో జీర్ణింపకుండన్ భువిన్
దను గాపాడెడు నంచు నెంచుట లసందర్భంబు గాదే ? ప్రభూ! ౨౫

చ. అవిరళ మీప్రపంచ, మొకయంచున గిట్టిన పేటెయంచునం
భవమగువారువిత్తెమును, బంధము కున్ మఱియంతులేమ, త్రెం
పపశముగాదు, లేవని బాయదు, మందొకటే ? తవాంఘ్రిగాం
గ విమల తోయపుం బ్రభవ నాదములన్ విని యేడ్పుమానుటే. ౨౬

ఉ. పేరిడుకొంచు దేహితనవిశ్వముదాను సృజించుకొంచు నిన్
పేరుగజూచుఁ, బేర్వాపిచి విశ్వమునున్ దిలకింపనిమ్ము, వీ
సారమె మానవుండు ? మఱిజాటడుదానని, తాను గన్నసం
సారమటంచు, నెల్లయొక చక్కని సాగరమట్లు దోచుఁటో. ౨౭

చ. బ్రదుకుననకెన్ని యాదరవులన్ గనువారలొ వానిలెక్కవే
యుదరమే? పండ్లుధాన్యములు కాయలుకూరలు ప్రేగులేక్కకో
క్కు: దినదినదొక్కటున్నె? యెవరున్ దమకుచ్చ్యమమత్స్యమున్ దినే
బ్రదికెడువారు; వాయికినిబంధమువెట్టుక వచ్చువాడు లే
డుదధిఁ దిమింగిలంబు చిమిసారక మ్రింగుచుఁ గ్రొవ్వుచూపదే? ౭౬

చ. వదలదు మోహపాశ, మెపుఁడాయెదుపుత్రకళత్రచింత తా
బ్రదులదురొక్కరంచిఁ బెనవేసుకపోయిన ముద్రెత్రాడు, చూ
పుదిగదుగద్దె క్రిందగలభూమికి; బున్నెము పొంతపోదు బు
ద్ధి, దొరతనంబుకోసము వధింత్రుహరింతురు తోటిమానవున్. ౭౭

ఉ. మంచిలభింపదాని నిలమానవుడే సమకూర్చుకొన్నవాఁ
డంచుమతింత్రు పెద్దయినసయ్యది దేవునిచే ఘటిల్లె; పం
చెంచిపచింతురియ్యది మహీతలమందున నెల్లవారిలో
మించెడునై జభావము, భ్రమించు స్వభావమహాత్మికంబులున్. ౭౮

ఉ. పిల్లలువానచూచి, యొకవేడుకఁజేతులుసాచి యాడుదుర్;
గొల్లలువానకున్ జవిసి గొంగళికప్పుకలోయనాగుదుర్;
పల్లములో సరోజములు పొడ్చెదుమూర్యని యెంచనేటిమిన్;
మళ్ళుమొగాలఁగల్వలు గ్రమంబుగముద్దుసవక్కఁవన్నచో. ౭౯

ఉ. ఆపదిమాపకై కడు బ్రియంబడి పత్సల భావమూనుటల్
వావిరిబుట్టుబుద్ధి నిజలక్షణమాత్మకు నింపుసొంపు; కా
దావిధిపేసకై యుదయమందున ఛాంపసురాలువోవుటల్;
లేవిట ప్రేమభావములు లేవిటనై జపుటీను సంభ్రమాల్. ౮౦

ఉ. చీవఱచీవరై యకట పేఱుడుగుడ్డలు దాల్చియుండగన్
వీధినిబెట్టమిట్టెఁ దనవృద్ధిఁ గుబేరునిఖ్యాతినందు వా
డావరభావమూనునె ? నాత్మ నెఱుంగునె లెన్ ? దుదిన్ దెవుల్
మీదయితన్నునయ్యొలికి మెట్టుచుఁ జేయుచుమిత్రియుంచుమున్. ౧౯

ఉ. చాకలి బట్టలుస్సురని శబ్దము సేయుచు చిల్ల నోవగా
నాకలి వేయునా ? యతని కాకలి చేరగనున్నమంట యీ
లోకమునందు ముఖ్య, మవలోకన సేయఁగ వెట్టిలేదురా ?
చాకిరియేపదమ్మైననువిసాగదురా ఫలము క్తిలేదచో ! ౨౦

ఉ. కోపలిన తిట్టు ; మఱికోపలొ ? యుత్తపురట్టుపెట్టు; నెం
దోపలు బంధిలోను మఱియోడలబంధములు వచ్చు; దిప్పలన్
బాపగనేరు, లొక్కటి పట్టువయిన నిలుచుచు నేర్వు: నీ
శ్లోకము దాటు నొక్కటిల; నొక్కటనేరముగా రహస్యమున్. ౨౧

ఉ. ఎందఱు రాజులున్నఁ గనమేమఱి యందఱి బిక్షులన్ బధిన్ ?
ఎందఱు పుష్టినున్నఁ గనమేమఱి యందఱు నీరసస్థులన్ ?
ఎందఱు కల్మినున్నఁ గనమే మఱి యందఱు లేనివారలన్ ?
ఎందఱు బుద్ధినున్నఁ గనమేమఱియందఱు వెఱ్ఱితొఱ్ఱులన్ ? ౨౨

ఉ. పేదరుఁ జేవ యీశ్వరుడె; పెట్టికి పెట్టియు నీశ్వరుండె పో !
కాదనుచో జగంబెటుల గత్తరయై యవినీతివర్తియై
"నీదయనీద" యంచును గణించెను నీశ్వరనామమెప్పుడున్ ?
లేదు మతంబు, లేవు నిజరీతికనుంబడు దివ్యభావముల్. ౨౩

## ప్రకృతి

ఉ. మందెమసూర్యు డుత్సుకతమాకులనాకుల సంజవేళలం
దుండఁగదన్ని సొంపుగఁ బ్రమోదనమింతయు లేకపోయినన్;
మెండగుపేటిమెంత పదిమేకొనివెంటనె మాయమౌనుగా
యండజముల్ సరీసృపములావులు మేకలు సంచరింపఁగన్. ౧

చ. అడవిఁ జరించు పెద్దపులికందపుఁ జర్మము వెట్టినావు; దా
నిడవులలో సగంబయిన నేరదు గోవు భ్రమింపఁ జేయఁగన్;
పురమునిగేకికిన్ మిగులపొంపగు పింఛము గూర్చినావు; దా
నిడవులలో సగంబయిన నేరదుగా పికమాడిపోవఁగన్; ౨

ఉ. వానపయిన్ బడన్ మొలక పచ్చనలేచుచుఁ జల్లచూపులన్
గోనకులప్పియైవెలయు; గోశ్యమునాదె ఋవస్మృహాస్తిక
జ్ఞానముగోచరించుటలు; సల్లలితంబులు పూవులాపయిన్
మానితముల్ ఫలంబు లసమానము సేవఁదలంపఁ బిమ్మటన్. ౩

## ధర్మపన్నాలు

ఉ. కమ్మనిపాలు గాయగను కమ్మనిమీగడ దేరునట్లు, వా
క్యమ్ములు సెప్పువాని హృది కష్టము దప్పిరిదైన, వానివా
క్యమ్ములనున్ సుబోధలగుఁ; గాని యెడన్ గణియింప రెవ్వరున్;
బొమ్మని బ్రువ్వనాడుదురు బుద్ధొకటున్నదె నీకటంచునన్. ౧

చ. కవనము ధారగా వరునగాఁ దనయంతనరావలెగాని యొక్కచో
టవిసుగు చేతగూరుచునితావుపయిన్ గలముంచి యూహకై
దివులఁ జదవెబయనె నెమకి వేదరిబుట్టలనల్లునట్లుగాఁ
బవులకొలన్ రచించుటలు సంతసయాః మదికిం బ్రశాంతియాః ౨

స్వేచ్ఛయటంచు గంతులిడువీరలెకాని, మనంబులోని స
ర్వేచ్ఛలు ముందుజంపునెడ స్వేచ్ఛయటన్నదితానె పుష్పపుం
గుచ్ఛముపోల్కి చేవడుచు గొప్పసువాసనలన్ రహించు నం
చుచ్ఛమనస్కులై తెలియనోడుమరేలొకొ నేఁడుమానవుల్ ? ౯౯

## అ న ం త ము

చ. మరణము ప్రాణికంత; మలమార్గముకంతముకంచె, భూమికిన్
శరనిధియంత, మంబుధికినాన్ నభమంతము, సూడనెందునేన్
దొఱకును నంతుపొంతు; కవితోచక వ్రాసెడుపద్యపంక్తికిన్
దొఱకదుగాక ! కలమున్ బనికట్టుకయెవ్వడాపెడిన్ ? ౧౦౦

---

రచన అప్పటప్పట
22-2-1932 నుండి
20-5-1932 వఱకు

* * *
సర్వం సంపూర్ణము
* * *

స్ఫురణ
ఐహికాముష్మిక
మహాప్రపంచము

## అనుబంధకందార్థము

చిందము, మాకందము, గో
విందమ్మరవిందము, సువివేకానందం,
బందము, హృదయ స్పందము,
కందము, మకరంద, మాంధ్రకవిబంధము కను !

అతని తోడను కలిసి నీవను,
తెనుగుబాసను తీపితెరలు దానికేను,
కణుగుబెణుగులేక కాలందెఘులుఁ జను,
కవిబంధముకను,
అతనితోడను కలిసి నీవను.

క॥ వే॥ం

8-2-1946

శ్రీరస్తు

# కందసూక్తి

కవికొండల వేంకటరావు

క. తేరెక్కెడు వీరునకును
సారథిగావలయుఁగాని, క్ష్మాస్థలిఁ బదసం
చారము సేసెడువానికి
నేరువలయు ? దారిచాలు, నిదిగో దేవా ! ౧

క. "భారంబెవనిది ? మోతకు
నీరంబులనిచ్చి, ఘటము నిర్మింపనిచో ?"
"సారాసారవిచారా !
నీరదమునకీఁబడినదె ? నీకునునంతే !" ౨

క. "పారంబెఱుగునె ముత్తెము
ధీరుఁడు వలనెత్తి దులిపి తీయకయున్నన్ ?
కారణరహితోంకారా !"
"అరయుమా స్వాతిచినుకునకునౌతపమున్". ౩

క. "నిరపసుఖ మెచ్చోటను ?"
"వారిధి భంగాలు మటలు పంథను శాంతా !"
"కోరిక లెచ్చోనుండవు ?"
"మారుని దహియించు రుద్రమహితకడ దాంతా !" ౪

క. దార, సుతాదుల మర్మము
దారమునకు సూదికిఁ గలధర్మముఁబోలున్;
జారించిన దూరించినఁ
గారుతనకు; పేకబిళ్ళగానమె తుదకున్ ? ౫

క. "నీరదివంకర దిరిగిన
నీరంబుద ? యిసుకద ? యలనేరము చెపుమా !"
"నీరము నీరధి గలియును;
తీరంబులఁ గలియునిసుక; తెలియుము గర్మన్". ౬

క. "ఘోరదరిద్రత యెవరిది ?"
"సారసబంధితములైన షట్పదములదౌ;
సారసజాతా శ్రీహరి
పేరురమున, ముక్తిగొన్న, వెడలవవికటా !" ౭

క. తారలు పొడిచే దెవ్వడు ?
తారలలోఁ జందమామ తగులుకొనిన పే
దారులుదీసే దెవ్వడు ?
ఆరహినిన్ రేయిజటపు నందమెవనిదో ? ౮

క. వీటిడీ వ్యాఖ్యానంబుల
సూరిజనుని వాగమృతము చూఱగొనుటెటుల్ ?
ధారాధరపుంభారపు
గోరాడెడు గొట్టెపోతుకున్ దెల్లంబే ? ౯

క. కీరము పలుకులు పలికిన
నేరిపె నెవ్వండోయనఁ గనెగడు ధరిత్రిన్;
నారీమణి మర్మములకు
గూరిమియేప్రాపు; గురుని గోడుండదురా ! ౧౦

క. మొగులున మెఱుపురహించుచు,
సొగసుగ వర్షంబుసూపు ; చూపుజగమునున్ ;
తగుసుజ్ఞానంబట్టిద ;
పగఱెడు మనలోనివాని ; పగఱెడుఁ బయునిన్. ౧౧

క. "ఇది పగ లిది రే" యనుకోఁ
జదలమెదలు సూర్యభాతి, సరిగ "సకాలం
బిది, కాలంబిది," యను, తెలి
వెదియే నీయంగనుండదే ? — కనుదానిన్. ౧౨

క. నరుభాషనరుడు దెలిపిన
నఱపులజంతువులు, పక్షులారజములచే,
మెఱపులమేఘంబులు, ప్రభు
నెఱిగించెడు; నెఱుగనిదెది ? యెఱుగుఁజడంబున్. ౧౩

క. కొలిచిన విగ్రహమయ్యెడుఁ
గొలవనిచో శిలయయగును; గొప్పమనమిడన్
గలిగెడుఁ గొండొకదానికి,
పలుకదు రా రాయి, తినదు పళ్ళు ఫలంబుల్. ౧౪

క. మనుజుడు గడు ననుకొనునెద
దనకుంగలబుద్ధిచేతఁ దాదొరననుచున్ ;
దనబుద్ధిని బశుబుద్ధినిఁ
జనదుర భేదింపఁ, బశువుసత్తాపసియే. ౧౪

క. నరునట్లె పశువు మెసవును,
నరుబలె నిలుచుండి పొలమునడుమున నదియున్
వెఱగునఁజూచును నాకస :
మరయదు బశువీశునన్నయనదిడ నబబే ? ౧౫

క. మబ్బు పేసినంత ప్రొద్దుకు
ప్రభలేదను పోల్కిగాదె, ప్రాపంచసుఖా
నుభవమునను బడి, యజ్ఞత
నభవుఁడు లేడనుట వాని యాజ్ఞమఱచుటల్. ౧౬

క. వబవబవానలు గురిసిన
నభమునకొక చుక్కపోదు; నాదము నస్య
ప్రభవము సర్వము భూమికె;
శుభకృతు లమ్మాడ్కి బ్రోగిక్షోణిఫలించున్. ౧౭

క. బురదను బెరిగిన పంకజ
మరయగనఖిలాంశుఁడయిన యర్కునితోఁ జు
ట్టఱికము వడసిన దనుఁ బో
బురదపయికిఁ జిమ్మికాదు; పొరిసురభిళమై ! ౧౮

క. కవనంపు నవరసమ్ములఁ
గువకువమను పక్షికూతఁ గోరికలున్నే ?
అవిరళమనోహరములగు
చు, వెలయు; దివ్యమగు సృష్టిచోద్యం; బంతే. ౨౦

క. తల్లోని నాల్కపలుకులు
ముల్లోకములకగుపసుల ముందెంతలురా ?
మొల్లోతునీళ్ళఁ దడిముడ
జల్లపడదు, పరిగెపడదు, జలధిచౌఱ యెటుల్ ? ౨౧

క. కల్లమ్ము సంగడుంచును,
చల్లమ్మగ, విధివిధిఁ జరియించుచు, మేల్
చల్లోయని యఱవవలయు ;
వెల్లడి సేయుముర తఱచివిజ్ఞానంబున్ ౨౨

క. ఉల్లంబు బత్తి నెగడదు
పుల్లని పులిహారలుతిని పూపులు చుట్టన్,
ఒళ్ళుదినల్లంబుట్టిన
అల్లోనేరేడు పళ్ళ యాహారమునా ? ౨౩

క. నల్లికి నెత్తురు సత్తువ
యుల్లికి వాసనలుసత్తు, పూరూరెగిరే
పుల్లాకుకు సుడి గాడుపు
లిళ్ళవెనుక సత్తువిచ్చు, నెవరెంత్రుహారీ ? ౨౪

క. పిల్లలు బడిలోఁ జదువుచు
నల్లఱి సేయుటలులాంటి దరయుచు సృష్టిన్
ఉల్లంబుంచియుఁ దప్పులు
కొల్లలుగా జేయుచుంటి; కుఱ్ఱవుగాకోయ్. ౨౫

క. నీళ్ళనుబుట్టిన యగ్గికి
నీళ్ళచలువగుణములేదు, నీళ్ళకుఁబైఁబై
వెళ్ళెడుగాలికిఁ జల్లన;
మళ్ళీఁగనఁగ నగ్గిగాలి మైత్రిఁ జెలఁగెడున్ ! ౨౬

క. కాలో చేయో వంగిన
నాలోచించెదవు దేవ, నందాకను నీ
వే లోకము లోకము నీ
దేలాగన్న మచ్చునెగిరెదవుసరా ! ౨౭

క. "హాలాహల మెటఁబుట్టెనొ ?
"పాలసముద్రంబులోనఁ బర్వేందుముఖీ !"
"ఆలిల యేమి మేలిడె ?"
"ఫాలాక్షునకయ్యెనంట పాయసముసఖీ ! ౨౮

క. నేలది పచ్చికమోపిడి,
గోలను పననిచ్చి, తాను గోరదు పాలన్,
నీఱలు మబ్బులఁ బడసెడు;
ఏలలి నెవరికెవ రుపకరింతురొ కనుడీ ! ౨౯

క. కుక్షింభరత్వమునఁ జను
మక్షికములు నశుచివస్తుమార్గమె దొలకున్,
అక్షీణమధువుగొని మధు
మక్షిక మితరులకు దాచ, మన్నించు బువుల్ ౩౦

క. చేయెత్తు శిరముకును పై
హాయసమందంగఁబోదు; అందలమెక్కచే
తాయెత్తు కట్టుకొన నీ
యాయువు సాధింపఁబోవ; రందలు మొక్కచే. ౩౧

క. కోయన్ గాయలు చేవడు,
దూయన్ బనరాకువచ్చుఁ, దోయజముఖి, తే
ప్రాయమురా, మనసిచ్చును,
న్యాయార్జిత విత్తము మది హాయి నమర్చున్ ౩౨

క. లోయల వానలు గురియుచుఁ
కాయకసరు, పచ్చగడ్డి కనబడునంతన్,
మేయగఁ బశువులు మూగియుఁ
గోయిలలటఁ గొలిచి చన్నకూరుములిడునే ? ౩౩

క. ఏ యిండ్ల చుట్టు చూచిన
వాయసములెకాని, యవ్వి పాడునె చక్కన్ ?
వాయసములు దవుదలుమగఁ
బోయిన పికములను వినగఁబోలును కుట్టా. ౩౪

క. మాయడ్డ మేమిలేదని
చేయడ్డము దీసికొంచుఁ జెరువున గోపి
ప్రేయసి నిలువున నిలబడ,
ఛాయడ్డుమటన్న నల్లసామి యెవరురా ? ౩౫

క. కోయిల కూసినదంటె
కూయించినదింక నొక్కకోయిలచేతన్;
మాయింపదు తనతో ధ్వని;
సాయంతనమందు విన్న శర్వరిగడచున్. ౩౬

క. పేగదిమఱువని వారికి
రాగంబులు, తీఱియేడ్పు రాగంబులురా !
పేగది మఱచినవారికి
చాగములును యాగములును సన్యాసమురా ! ౩౭

క. సాగరునకు క్షారము బో
దేగతి నెన్నెన్ని నదుల కేలికయైనన్;
మేఘమునకు దీయము బో
దూగుచు నది సాగరుపయి నొఱసినడచినన్. ౩౮

క. కాగిననీళ్ళను జన్నీ
ళ్లేగతి పోసినను గలసి యెసగును నీళ్లై;
సాగదటు పాలతోడుత,
నాగవలయుఁ జల్లబాఱునంతకు మిత్రా ! ౩౯

క. ఈగకు దోమకు జతయెటు ?
మూగిమురిసికొంచు రోగమూలములగుచున్
భాగస్థులు కుళ్లన గాం
గాఁగద ! దుష్టుల ప్రవర్తనము జతయంతే ! ౪౦

క. జ్ఞానంబెవనికి లేదో
యానరుహృది నంధకారమతివికృతమ్మౌ,
తో నరుడెంచెడు వానిన్
గానడు, సరిఁగాననీడు, కలుషవిదూరా ? ౪౧

క. వీనులకు విందుగూయుచు
కోనముఖరితంబు సేయు కోకిలకొఱకై
మ్రాని కొనల నెమకు నపుడు
కానఁబడెడు కాకములను గసరఁ బిక మెదీ ? ౪౨

క. జ్ఞానికి నజ్ఞానికినిన్
స్థానంబుల భేదమరయఁ జాలరు జనముల్,
మానితపునుడుల నాడగ
జ్ఞానివెలయుచుండు ; బరుడు జడుడనిపించున్. ౪౩

క. వానలు పడ్డటె భువి సు
జ్ఞానుల యవతరణమున్న ; సస్యములకునై
ప్రాణులనవిపోషించిన
మానసముల వీరుతెలివి మాటలఁ బ్రోతుర్. ౪౪

క. ప్రేమనుబుట్టుచు జగములు
ప్రేమను లయమందుచున్న వెరవు దెలియుమా ?
క్షేమంకరుడగు నీశ్వరు
నేమాయోపాయమైన ప్రేమ ప్రభయే ! ౪౫

క. కొండెక్కు వాఁడొకొకయెడ
ముండులపొదలూత గొనెడు పోలికదేవా!
చండతరములయినను నీ
దండనములుఁ దలనుదాల్తుఁదలగనుదొలగన్. ౪౬

క. తొండముగల జంతువు దాఁ
జెండిమెసవుఁ దూండ్లపూలు చెరువునఁ బడుచున్ ;
తొండముగల గణపతి యో
దండకుఁ దెమ్మంచుఁ గల్వదండలువాల్చున్. ౪౭

క. సౌందర్య మెందుగాంచిన
నందందునెకంచె కాయునట్టుల, నీతుల్
దెందంబుగాయుచుండును;
దుందుడుకుపుణుక గులాబిఁ దొట్రిడదేముల్ ? ౪౮

క. అందంబుకొఱకు స్త్రీ
నిం, దమిగూడు నెడ నింటె నియమము పసయే ?
ఎందేనెఱుగుము సృష్టినఁ
గ్రొందామరఁజేరు తేటి గూటి నిలుచునే? ౪౯

క. కందమునఁ దప్పుతడమట
సందెట జవరాలికొంగు సవరించుమిషన్
అందెలలోఁ జేయుంచుట,
సందుచూచి చేయిపైకి సాగించుటలున్. ౫౦

క. విత్తము హరించుచోరున్
గత్తరసేయంగవలయు, ఖండింపవలెన్ ;
చిత్తము హరించు దేవున
కత్తనువతగానిదెయని యర్పింపవలెన్. ౫౧

క. పిచ్చెత్తిన నరునుడువుల
పచ్చిబూతులాడువాని పలుకులలోనన్
అచ్చులు హల్లులు వినబడు;
అచ్చపుభావములు కొదువ యంతే సభలో. ౫౨

క. తిత్తిరిపోతము తనకా
లెత్తుచు నాకసము నిలుపనెంచు విధముగా,
బత్తుడు గుడి గట్టించుచుఁ
గ్రొత్తగ విగ్రహముపెట్టి ఘోషింపఁబరున్. ౫౩

క. పప్పున్నద యుప్పున్నద
ఇప్పొద్దునఁ గూరగలద యేమేః యనుచున్ ;
ధప్పళమును వడియమ్ములు
తప్పక వేయించువాడు తగుగేస్తుండౌ. ౫౪

క. పెట్టేమి పెట్టఁగోకిల
పిట్టకొమనుజేరి పాడువేడుకమీరన్ ?
తుట్టతుదయొగరు చిగురెగ!
ఎట్టెట్టేమిడ్డుకవి యెసగించు నుడిన్. ౩౩

క. నిప్పులవి యెన్నియుండిన
నుప్పతిలదు దీపకాంతి; యొకచిటివత్తిన్
జప్పున నంటింపగనే
ఎప్పుడవెలుగే! తెలియుడిల దృఢమతివాడిన్. ౩౪

క. పిట్టపరివీధి నెగురన్
జెట్టుపలను విప్పియార్చుఁ, జెట్టుపయినిదాఁ
బట్టూని నిలుచునప్పుడు
గట్టిఫలముఁ గొఱుకు, కర్మ కౌశలమంతే! ౩౫

క. బత్తాయికాయ నొలుచుచు
బత్తిని దేవునకు బెట్టఁ బడయగవచ్చున్
అత్తొనలఁ గొన్నితొనలను;
అత్తెగువను నొలవకున్న నర్చకుడిడునే ? ౩౬

క. ముచ్చెమటలోడ్చు నంతట
వచ్చిన నొకకొత్తకాసు వచ్చును; రాదేన్
పచ్చిపులుసులో మిర్చికి,
పచ్చిచేపకున్న కొదవె పాటట్టిదిరా ? ౩౭

క. నిత్యానందంబెవనిది ?
సత్యాన్వేషణపరునిది; స్వార్థమనంగన్
బ్రత్యేకతయన నెఱుగడు;
అత్యంతంబతని దృష్టి యఖిలమునిండున్. ౬౦

క. సరసత సౌందర్యప్రభ
గరితకుఁ గోకంచుద్రిప్పి కట్టనురాదో,
దరయమె గరగలఁ గోకలు ?
మెఱసి మెలగవలయు మానసీయపు మనికిన్. ౬౧

క. చెఱకునకుఁ దీపి వేఱన
దొఱకదురా, చివరదవ్వ దొఱకదురా మ
ధ్యరహిని నమల దొఱకునుర !
అరయుమి జీవనము తీపియవనిపైనెరా ! ౬౨

క. సరసత చక్కందనమున్
తరుణత్వము మధురకంఠనాదము నతికిన్
పరు నాకర్షింపను నుప
కరణాల్, నిలువవవి, ప్రేమెకడకు నిలబడున్. ౬౩

క. బురదన్ నీటన్ బుట్టియు
సరసిజదళమంటనీదు జలమునసటినిన్,
నరుడా ! యవ్విధముననే
ధరసుఖములఁ గష్టములను దగులూనకుమా ! ౬౪

క. ఎఱుగుదె నీభార్యనుమును ?
ఎఱుగుదె నీబిడ్డలమును ? ఎఱుగకయున్నన్
పెరిమయిడుదు వారియెడల;
ఎఱిగిన భగవంతు మఱిగి ప్రేమింపవయో ! ౬౫

క. తరుణవయోవిభవము రాఁ
దరుణీమణియందు మనసు దగిలించినటుల్
పరిపాక కర్మమునఁ గన
మఱిగెదురాదేవుచింత, మానవురవరా ! ౬౬

క. పులికిం గ్రౌర్యము మిక్కిలి,
చలిక్రౌర్యము దానిమించుఁ జలిచే వణికె
యలనాయకు గవయని చెలి
పొలయలుకనుజెలగు క్రౌర్యము పులికె చలియో. ౬౭

క. తలచిన రాముని దలపుము,
కొలచిన సీతాసమేతుఁ గొలువుముమనసా !
పిలచిన కృష్ణుని బిలువుము
నిలిచిన యాదవకిశోరునీడ నిలువుమా ! ౬౮

క. తెలవాఱునంత చూడగ
వలయునురా సూర్యదేవు బాలకిరణముల్.
అలకిరణద్యోతులఁగద
తెలవాతెడు, మనమొగాలు తేటంబడెడిన్. ౬౯

క. వెల యెఱుగని వానికి శిల,
వెల యెఱిగిన వానికి మణివిధము గదోయీ!
తలపోత గొననివాడును
తలపోతంగొనినవాడు ధరణిం గుఱ్ఱా! ౮౦

క. రావికి వేపంగలిపిన
రావిరవశివేము సేతరాదయినను దా
జీవకళను వినుఁ రావిన్;
గోవిదు సద్గోష్ఠిచేరి కొలువుము కుఱ్ఱా! ౮౧

క. గాధకుఁ గారణమడుగకు,
బాధకుఁగారణమునడిగి బాపుము సలుపుల,
బోధకుఁ గారణమడుగకు,
ఆధికిఁ గారణమునడిగి యడగింపవెతన్. ౮౨

క. ఏపగిది విడుచు బువ్వులు,
ఏపగిదిన్ బొడుచు జుక్క, లేపగిదిని ర
త్నోపలములు ధగధగమను,
అపగిదిన్ దివ్యచక్షువమరనగు నెదన్. ౮౩

క. సాధువుని సదావృత్తి క
నాధమనోవృత్తికిని గణనయనిపేరే?
మేధావి గాకపోయిన,
మాధవుదే ధవుడటంచు మతినమ్మనిచో? ౮౪

క. నాసాపుటముల వాయువు
దీసివిడుచునపుడు దేని దెలియగ వలయున్ ?
రోసమున బుస్సుమనెడు స
రీసృపముగాదు నిజశరీరమును సఖా ! ౭౫

క. భోజనము నిదుర రెండును
నేజనునకు వలయు; వాని నేమరరెవరున్.
ప్రాఁజదువు చదువడొక్కఁడు,
యోజనమున్ జేయడొకడు యుక్తపథంబున్. ౭౬

క. త్రాచుకు పాల్పోయుచు మన
లోచనముల ముందునుంచి లోకువసేయన్
వేచక మానునె ? యెప్పుడొ
వేచిపడగ నెత్తి కాటువేయు, విషమిడున్. ౭౭

క. చేదన్నది వేమునకా ?
వాదన్నది దుష్టురాలి వర్తనమునకా ?
స్వాదువు తిని చేదు తెలిసి
వాదించెడు మనకుగాని, పత్నికిగానీ ! ౭౮

క. కూపమున బడిన వారిని
గాపాడన్ ద్రాడు వలయుఁగడ వలయునురా !
పాపమున బడినవారికొ
నీపాదము వెంటవెంటనే యుండుహరీ ! ౭౯

క. రాదుర దయ, లేదుర దయ;
చేదురదలువోవ నిన్నుఁ జెండుదురదయన్;
ఈదరినిం బాపుడవై
యాదరికిన్ బోదుపేని యమభటులు ఖలా ! ౮౦

క. కవటాకు తమ్మలమ్మను
జవరాలందిచ్చునంత చాలదు; తానుం
గవగాఁ గూర్చుని, సేవిం
పవలయు వరుఁగూడి మెఱసి భాషించుచునున్. ౮౧

క. మఱిచెట్టుకూడ దిగునెడ,
బరువగు కొమ్మలను నిలిపి, పడనీయదిలన్;
కరమున్ మగవాండ్రందుల
కొఱకని గడ్డంబు పెంచుకొందురు కొమ్మా ! ౮౨

క. వినువీధిఁ బక్షి యెగిరిన
గుణము నినాదించి బోయకొట్టు స్థిరుండై,
చనబోడు పక్షితోడుత,
అనయమ్మటిదాత్మతత్వ మచలపుగుఱితో. ౮౩

క. కులకాంత యెపుడు మగనిన్
వెలపెడునందంబుగూర్చి వినిపించదిలన్,
తలచున్ బెండిలివిందులు,
తలచున్ శోభనపుఁ జీర, తలచున్ గాన్పున్. ౮౪

క. దీపంబు గాంతియిచ్చిన,
దీపములో నలుపెనకుమ; తెలివిజగముకై
యేపగిది నుపకరించిన
లోపల మన తెలివిలేమి రూఢియెకుత్తా ! ౪౧

క. దేవునకు హృదయముండిన
దేవుని హృదయంబు రొదనదించుట లెచటో ?
భావింప దీనులందున,
పావనజనకోటిమధ్య, పసిపిల్లయెడన్ ! ౪౨

క. కోపము వోయినవానికి
తాపంబావెనుకబోవు; తాపముతో సం
తాపమువోవును; లేదిక
పాపంబన; కోపతాపభావా లఘముల్. ౪౩

క. పుట్టుకపట్టియుఁ బేరుం
బట్టియు దాబమ్మయయ్యుఁ బరదారను వే
మిట్టిపడి బలిమిచేతన్
బట్టుటచేఁగాదె సెడియెఁబౌలస్త్యుఁడు మున్. ౪౪

క. దున్నిన రైతుకు మన్నేన్
మొన్నటిదాకాను మిగిలె; పూజ్యమదియునేఁ
దన్నా ! రైతేడ్చెడు; పడిఁ
గన్నీటికిఁ బొలముమన్ను కడలిఁ గలియగన్. ౪౫

క. చింతాకులు లగువారికి
సంతోషముగూర్చు మంచిసంగీతమనన్,
జింతాకులలోఁ గోయిల
పంతానన్ గూయునేడు, పరికింపుసఖా! ౯౦

క. శ్రీరంగ! రంగ! రంగా!
నారంగఫలమ్ము నీకు నైవేద్యము; నో
రూరంగ వలుచుకొనితిను;
గోరెంతును! నీదునోరు గొప్పనునెంతున్. ౯౧

క. "నీరూపమెంత? యద్దము
నారసికొని మరియు" మన్న, నకట! తనియఁబో,
"నేరూపమైనఁ జూపున
దేరా? యయ్యద్ద" మంచు నెక్కిరిపింతున్. ౯౨

క. నీరధిని బోవునాతడు
తారనొకటి గుఱిగ గొనుచు దఱిజేరునటు, సం
సారమున జరుగు నాతం
డారసి కొనుచుండవలయు నాముష్మికమున్. ౯౩

క. పాఱునియెడ, పంచమునెడ
వీరునియెడ, భీరునియెడ—వినవేమి? మహో
దారునియెడ, దారుణునెడ,
నారయ, పరమాత్ముడుండు వ్యాప్తిమెఱయుచున్. ౯౪

క. ఊరెవరు గట్టినారలు?
పేరెవ్వరు పెట్టినారు? పెదబాబయ్యా!
నీరెవ్వరిచ్చువారలు?
కూరాకెవఁడిచ్చుఁ గూడుగుడ్డ యెవఁడిడుఁ? ౯౫

క. చేరాని పనులు చేయకు,
పోరిమివంకకును బుద్ధిపోనీయకుమీ!
ఓరిమియెయ్యెడ వదలకు,
నారాయణపదకమలము నమ్మినిలువుమీ? ౯౬

క. శ్రీరామమయసునామం
బారామమయంబు సేయ నలరి శుకంబుల్
దారిఁగను పొంతతెక్కల;
కారాకులకో? పెనుసుడి గాడ్పు లె జరుగున్. ౯౭

క. నూరేండ్లాయుర్దాయము,
మేరువు బంగారమిచ్చి; మేనునకును దో
ప్పారం బీయని మచ్చగు
నారాయణనమ్మిగయిడి నడత యిడనిచో, ౯౮

క. సూర్యునకు రెండుపూటల
నార్యులు మ్రొక్కేటివారు, అధునాతనులో?
భార్యకు మ్రొక్కుచు — 'కాఫీ
కుర్యాత్' అనువారు; పొద్దుగూడ వేలేదే! ౯౯

క. శ్రీరాముని సద్ధర్మము
ఆ రాధాధవుని కర్మణానుసరణ మెం
దారయఁదరుణోపాయాల్
భారతవర్షంబునందు భ్రాతృవరేణ్యా ! ౧౦౦



రచన అప్పటప్పట 5–9–1932 నుండి 9–11–1932 వఱకు

సర్వం సంపూర్ణము

స్ఫురణ సర్వసామాన్య ప్రవృత్తి

శ్రీరస్తు

# ద్విపదలాక్షి

—: (౦౦) :—

కవి కొండల వేంకటరావు

అత్యుత్తముం డెవ్వడవనిపైఁ జెపుడ !
సత్యంబుదప్పని జనుడుదలపోయ. ౧

స్నేహితుండెవ్వండొ చింతించి చెపుడ !
యూహించుకొని సాయమొనరించు నతఁడు ౨

ధనముగలందుకు దానంబు పేత
మొనసి మబ్బుగురిసి మొక్కపెంచుటలు. ౩

అధికారమన్నది యపుడెకమ్మనిది
దధివోలె నిలవున్నఁ దగులు, బుల్లంగ. ౪

మంచివానికిఁ జూడ మహియెల్ల మంచే;
ఉంచినయద్దంబు యొదవించురంగు. ౫

చిన్నప్పుడేయూహ చిగురొత్తునదియె
యన్నప్పుడదెరెచ్చు; ఆచివిత్తడియ. ౬

కన్నీళ్ళనాఅని కట్టిడిచింత
చన్నీళ్ళఁబోవునా ? సమయుఁగాలాన ౭

అదిలేదు, ఇదిలేదటంచు నడలేరు,
మొదలెవ్వఁడెదిగించె మోకఁగా అడవి ? ౮

పెద్దపులి కేశిక్ష విడివడఁదిన్న ?
వద్దురాఖండింప వద్దుహంతకుని ! ౯

మాణిక్యములు గని మఱుగునన్నాళ్ళు
మాణిక్యములుగావు మట్టిలోరాళ్ళు. ౧౦

రాతగెంతనికప్ప రహిసూతగెంతు
ఊఁతదానికిఁ గ్రొత్తయొదవెనెవ్విధిని ? ౧౧

సూనృతంబులు చెవి శూలాలెయైన
మానకుఁ జెప్పంగ మంచికోసమ్ము. ౧౨

అలగులాబికిఁ జెప్పనగురంగు వేఱె
కలదె ? గులాబియే; గురుపమట్లుంచు. ౧౩

వీథిగుమ్మముమెట్లు వీణియమెట్లు
బాధింపవుర తిన్నపరిచయంబున్న. ౧౪

పేదకుగుడిసె కుబేరుకుమేడ
మేదినిపైగాని, మింటమేఘాలె ! ౧౫

తెల్లాఱునంతనే యెల్లాగునసకు,
పుల్లాట్టమునుజూచి బోధించుకోర ! ౧౬

చుక్కలు లక్షలు, సూర్యుఁడొక్కండు
అక్కడా భేదంబు ? అరయురేఁబవలు ౧౭

కొండపై గుహ సాలిగూండ్ల తోనుండు;
కొండచీపురువచ్చి కోటపేటూడ్చు. ౧౮

కోయిలకేమిచ్చి కూయించగలవు ?
కోయన్న అదియింకఁ గూయుగాకన్న ! ౧౯

వీధిలోఁ బడ్డాక విన్నదెవ్వారు ?
వీధివారేకారు, విశ్వంబువారు. ౨౦

ఆరంభమున కెవ్వ డగువాఁడౌ వాఁడె
పారంబు చేర్చురా; పతవముంచేత ౨౧

దివ్యమౌ నీకృతి దీపించువేళ
నవ్యయుం డగపించు! నగవడవీవు. ౨౨

శుచికాక దేవుని శోధించుటరయఁ
బచిఁ జక్కెరితకయ పాయసంగొనుట. ౨౩

తనలోనివానిని దగ ముంచెఱింగి
మనలోని వాడంచు మహిఁజాటవలయు. ౨౪

చీకటిఁదడుమ వృశ్చికము గుట్టేను;
ప్రాకటంబున నేర్చి పలుకరాదేవు. ౨౫

వేదాలు, సూత్రాలు వేపురాణాలు
ఆదరి నాదంబు నాలింప నణగు. ౨౬

ఒక్కొక్క మనిషిది ఒక్కొక్కతీరు;
ఒక్కదేవుని చేతనున్నారు మళ్ళి. ౨౭

ప్రజ్ఞ నీవెంతైన పరమేశు కంటె
తజ్ఞుండవవబోవు, తగదురా పొగరు. ౨౮

సూరుని తొలియెట్టఁ జూతుము గ్రుంక,
ఆరసి నారంభ మంతంబు నొకటె. ౨౯

లోని చీకటివిచ్చి లోకంబు సూడు;
పైని చీకటివచ్చి పరమాత్మ జూడు. ౩౦

కేశంబుదీసిన కేశంబులాంటి
దాశకు నంతంబు అగ్గి ముట్టింపె. ౩౧

చిరాకు పడునెడఁ జెడునుగార్యంబు;
రాకి తెక్కలుచిక్కగా నెగురునదె ? ౩౨

దాహమన్న వాని దగ తీర్పకుండ
ఆహారమిచ్చిన నంగుడే దిగదు. ౩౩

మధ్యవచ్చిన మబుల్ మనదగవెపుడు;
సద్యోద్భవంబు లాచారాలు సంతె. ౩౪

పూసరుఁ జిల్లున్న బొందలదా పేరు ?
కాశిలో కల్లమ్మ పదలదా గంగ ? ౩౫

ఇవల గోళ్ళంబుంచ యెఱుగంపు మూర్ఖు
డివలనే యేమస్తు ఎవటు 'లోప'లను. ౩౬

నీదు చెడ్డతలపు నిష్ఠురత్వంబు
నీదులోపలబుట్టి నినుభువినేచు. ౩౭

దయకు సమానంబు ధరణి నొందేది ?
స్వయముగహృదిఁజొచ్చి సవరించుఁజేత. ౩౮

అంధత్వమన్నది యక్షినేకాని
బంధించు పాడలవాటు మానసము. ౩౯

మాటను మంతిని మర్యాదవచ్చు;
ఆటను పాటను ఆహ్లాద మెచ్చు. ౪౦

బిడ్డలతల్లికి భిడియమెందుకిక ?
దిడ్డికంతవదలి తిరుగుగుమ్మాన. ౪౧

పిడుగుపడుటెవరు పిలచిచెప్పేరు ?
పడకుండ నది తప్పవలయునే కాని. ౪౨

కూళకు వేళకుఁ గూడున్నఁజాలు,
రాలకు పొయికూడ రాజంగవలదు. ౪౩

సందుగొందులలోన చాకలియిండ్లు,
సందడిబల్లులు సరసీరుహాల. ౪౪

వర్షంబుగురిసినవాడ నీటేమి ?
కర్షకుండందుండి కదకుదున్నుటయె. ౪౫

ఈరుపన్నిపొడవె ! ఏమితీయుటకయి ?
సౌరైన పాపిడా ? చాటెడు ఈళ్ళు. ౪౬

గండ్రకత్తెర యత్త గడుసుకోడలికి,
గుండ్రాయి యడ్డెట్ట గునపానఁబొడుచు. ౪౭

మహారాజుదగ్గఱ మంచిమంత్రియన
అహిరాజుముందఱ నాడించుబుట్ట. ౪౮

వేగుచుక్కకు గాంతిపెల్లెంతపేపు?
సాగెడుదాని వెన్జాయనేవేగు. ౪౯

విందువీధులగాదు, పెద్దిండ్లజరుగు,
మందులమ్మెవాడు మఱివీధిఁ దిరుగు. ౫౦

ఎవరు పతివ్రత? ఇలధవుఁ గూడి
కవిరితాంబూలంబు కరణినున్నాదె. ౫౧

సుందరి లోపాలు చూడ్కులఁ గనము;
చందురులోనల్ల చంద్రికనున్నె? ౫౨

వీధిన గూర్చున్న వెలదులఁ జూడ
పోదురు నత్తల పోల్కిలోపలకు. ౫౩

కులకాంత నీతోడఁ గూడియున్నపుడు
పలుకకు పరకాంత ప్రజ్ఞను గూర్చి. ౫౪

ఆలిని మగడెంత యాదరించేడో,
శీలతయూపెలోఁ జెలగునాపాటి. ౫౫

అత్తిల్లు పుట్టిల్లు ఆలికిగాని
తొత్తెక్కడికిబోవు? తొక్కునెత్తెక్కి. ౫౬

ఆడది అంటేను అందఱుగాంత్రు;
ఆడది బోగంది 'అవితె' ఆడింత్రు. ౫౭

పెదబాబు దగ్గఱ బేరమాడకుర
వదలరా పెండ్లాము వద్ద భిడియమ్ము. ౫౮

అందెలమ్రోతకు నాధారమేమి ?
అందెలా? సుందరా? యందంపుమోత? ౫౯

ఉయ్యాల యూపులో నూగేది తనువు;
సయ్యాట చూపులో సాగేది మనువు. ౬౦

హాయియన్నది యేది ? యుపకారమొకని
కేయెడఁ జేయక యెందుమేల్గనుటె? ౬౧

సాధన సంపత్తి సంసారమునక ?
బోధపర్చుకొ యాత్మమోక్షంబు కొఱకు. ౬౨

దాచేది యెవరికి? దాచేదియేది?
యేచక్కఁగాలిలా గెసగింపుమనికి. ౬౩

కురిసెడు వానదాఁ గురియుచునుండ
వరదవాపగలేవు, వానను జూడు. ౬౪

చెవులఁ బోగులుచుట్టి చెవులె యూపేర ?
చెవులతోఁదలయెల్ల సిగను నూగింత్రు. ౬౫

తీయనినీరంబు దివినుండి పడినఁ
జేయరుచక్కెర; క్షితిఁ జేతురుప్పు. ౬౬

కంచెకు నున్నని గడలుంటవటర ?
మంచిముళ్ళుంటవి, మార్గమెఱుంగు. ౬౭

మెట్టెంత యెత్తుంటె మేదిని తంత
పట్టుండు బల్లంబుఁ పడగనెక్కఁ కుమి ౬౮

వెఱ్ఱివాదంజేను వెఱ్ఱి యెవ్వరిది ?
వెఱ్ఱిలోకానిది; విశదమైసదిర ? ౬౯

తెలిసిన మనసుకు తెలవాఱుటన్న
పలపల వేగుటా ? పనిగాని ! యన్న ! ౭౦

భారంబుమోయంగ దూరంబుపోవ
నీరసుండెన్నండు నేరడుజగతి. ౭౧

ధీరతగలవాని దిద్దంగవచ్చు,
భేరిని మ్రోగించి పెడనాపునట్లు ౭౨

కాలగర్భములోతు కనువాడెవండు ?
గాలంబులే దదే గాలంబుమనకు. ౭౩

వీలులే దిప్పుడు పెళ్లిపొమ్మనుట
జోలిగలట్టిట్టి కూరుట్టిగాదు. ౭౪

లేదురా గణ్యత, లేదురా గొప్ప
మేదినికగుచేత మించకయున్న. ౭౫

భాగ్య, మారోగ్యంబు, పరికింప మంచి
యోగ్యత, యిమ్మాటనొదవును బదవి. ౭౬

పద్యంబు గద్యంబు పాటయే గదర
విద్యయంటే మటిపేడుకంటేను. ౭౭

మహిమానికము విల్వ, మఱిమొల్వకమురు
వహియించు సత్కాంతి పల్లటిల్లకయె. ౭౮

పొలుమూలములేని సంగతులన్ని
తాలావవిడివడు; కడకెల్ల తెలియు. ౭౯

ప్రేమానికేమిటి ? వేమాఱుచూపు !
నీమానికేమిటి ? నిత్తెంబుదాపు. ౮౦

గాలివాననైనాను కదలేది మబ్బె;
నీలనీలనభము నిశ్చలమెపుడు. ౮౧

చిటిపొటికలతలఁజెడనీకు మనసు,
కుటిలాలక చెదరు గోమది వేఱు. ౮౨

పాముపైఁ బవళించు పద్మనాభునకు
పాముపడగె గొడ్గుపట్టినట్టుండు. ౮౩

వినువీధిఁజుక్కలు వినుచు సద్గోష్ఠి
వినుమంచు రాత్రి తావేగ శబ్దమఱు. ౮౪

నేనునీవనుకొంటె ఏర్పాటుజగతి,
నేనొక్కరుడనంటె యేకంబుజగతి. ౮౫

సంసారయాత్ర నిస్సారపుయాత్ర,
కంసారి కంటికిఁ గనబడదందు. ౮౬

గరగకు పేరుకు గావింత్రుపూజ;
అరిగిపోకయ్యవి యట్టెయుంటాయ ? ౭౮

చల్లనిగాలైతె జడశరీరముకె;
చల్లని చేయైతె శాంతించునెడద. ౮౮

మనసులోపుట్టాక మఱిపోదు శంక,
పనసబంకట్టుల పట్టుకసాగు. ౮౯

నందిరాయైతేను నరులు మ్రొక్కెరు !
పందిరాయగునేని పరికింపఁబోరు. ౯౦

కొబ్బరికాయకై కూల్తుమా చెట్టు ?
నిబ్బరంబుగ నెక్క నేర్తుము తీయ. ౯౧

అంట్లుతోమేదానికై నాను వలయు
తుంట్లకిందకు నెత్తు; దొరకుండవలద ? ౯౨

తనువిచ్చి మనువిచ్చి తగు ధనమిచ్చి
'మనుసుఖంగా' అన్న మన లేదొకండు. ౯౩

కార్యాలయందు నక్కలకు వచ్చేది
మర్యాద యొక్కటే ! మనిషి తర్వాత. ౯౪

'పొలిటిక్సు'లలోని పురుషార్థమేమి ?
ఏలాగొ ఉద్యోగమేదొ కొట్టాలి. ౯౫

సంగీతమేమిరా ? సాహిత్యమేమి ?
వంగతోటను నీటి వం గనుకోర. ౯౬

ఏదుపంది ముండు లెవరిని గ్రుచ్చు ?
ఏదుపందిని గాక యితరులఁ గ్రుచ్చు. ౯౭

ఆవలి లంకనే యందంబుచూస్తు
కావలీవలి యొడ్డు కాచుట యెట్టు? ౯౮

వీధికి గుమ్మాలు వేయిపెట్టుకుని
వీధితల్పులు మూయ విశదమెవ్వారు? ౯౯

మదిరాక్షి కోపాన మన్నొంక చూత
అదియె లత్తుకయము యమరింది ద్విపద. ౧౦౦

కళ్ళంలో గింజలు గాదికిరాగ
ఇల్లాలి పెత్తన మెలుక పెత్తనము ౧౦౧

పళ్ళుగా సేచెట్టు పల్లంబునుంట
అల్లటిచిల్లటి నతివ తిర్గుటలు. ౧౦౨

సూరమ్మ పేరమ్మ సుబ్బమ్మ ముగురు
కారాలమిర్యాల గల్లంతువడిరి. ౧౦౩

సభలోనివారంత సన్యాసులైన
ఇభరాజు గమనను ఎంత్రులావొకటె ౧౦౪

పేలాలు ప్రేలుటేవేళకేనాగు.
కూళకు బ్రేలుడు కొసకంట సాగు. ౧౦౫

రాగంబు దీస్తేను రంజనం వలయు
పగాడిదట్టులో ఎలుగెత్త కెపుడు. ౧౦౬

పోగొట్టు కొనకురా పొద్దూరకేను
ఆగదురా యది ఆగుమన్నాను. ౧౦

పోల్చిన వారికి పోలికొపించు;
మల్చిన వానికి మఱి ప్రతిమట్లు. ౧౦౮

చాలన్న వద్దన్న సంసారబాధ
కూలంకషంబుగ గుడిపించివోవు. ౧౦౯

కనకున్న వినకున్న గాలిముక్కంట
చనకున్నె ప్రాణంబు జరిగింపకున్నె? ౧౧౦

సాధించువానికి సాగేదిమాటె
బోధించువానికి బొదలేది మాటె. ౧౧౧

చెఱుకున దీయంబు చేదువేమునకు
విఱిచిన, కలచిన వెడలి పోవన్న. ౧౧౨

పాలను దొరకట్లు వడిఁ గాచనీళ్ళఁ
దేలునా? పాలలోఁదిరుగునామీలు? ౧౧౩

వర్షపు జినుకులు వడిమిన్ను గురియ
హర్షంబు నొందురా యవనిపై మొక్క. ౧౧౪

ద్విపద సహస్ర పా త్తేజో విరాజి
నిపుణుండునడిపింప నృత్య మాడింప. ౧౧౫

ఇవియెల్ల లెస్స రచించె నెవ్వండు ?
కవి; కవికొండ్ల వెంకట్రావు సుండు ! ౧౧౬

జై హింద్

---

రచన అప్పటప్పట 26— 9—32 నుండి 9—11—32 వరకు } సర్వంసంపూర్ణము { స్ఫురణ బహూళాంధ్రోక్తి 115—116 రచన 7—2—1946